శ్రీ మాలోల గ్రంథమాల

పదునాలుగవ పుష్పము

# శ్రీ సుదర్శనాష్టకమ్



శ్రీమాన్ కె.వి. రాఘవాచార్య విరచిత

జ్వాలా వ్యాఖ్యా సహితం

శ్రీ సుదర్శనాయ నమః

# శ్రీసుదర్శనాష్టకమ్

## (జ్వాలా వ్యాఖ్యా సహితం)

వ్యాఖ్యాత :

శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు

ప్రకాశకులు :

శ్రీ మాలోల గ్రంథమాల

హైదరాబాద్

SRI SUDARSHANASTAKAM

శ్రీ సుదర్శనాష్టకమ్

ప్రథమ ముద్రణ : మార్చి 2004

కాపీలు : 2000

వెల : రూ. 20/-



ప్రాప్తిస్థానము :

**శ్రీ మాలోల గ్రంథమాల**

శ్రీ అహోబిల మఠం,

దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ,

హైదరాబాద్-500 013.

ఫోన్ : 27423043

ముద్రణ :

**వాగ్దేవి ప్రింటర్స్**

నల్లకుంట, హైదరాబాద్-44.

ఫోన్ : 30912541

శ్రీః శో2వ్యాత్

# ప్రకాశకుల విజ్ఞాపన

సర్వతంత్ర స్వతంత్ర, కవితార్కిక కేసరీత్యాది బిరుదాంచితులైన శ్రీ వేంకటనాథార్యులనే నామధేయంగల వేదాన్త దేశికులవారు అనుగ్రహించిన అనేక స్తోత్రకావ్యాలలో 'శ్రీసుదర్శనాష్టకం' ఒకటి. ఇది ఎనిమిది శ్లోకాలు గల చిన్న పుస్తకమే అయినా, దీని దధితి గొప్పది. ఇది సుదర్శన చక్ర భగవానుని వైభవాన్ని ప్రకటించే నామస్తోత్రం బోధిస్తుంది కదా! పలువిధాలైన ఆయుధాలు కలవాడు శ్రీమన్నారాయణుడు, అని ఆనామానికి అర్థం.

"హేతిభిశ్చేతనా వద్భిరుదీరిత జయస్వనమ్" (రఘువంశం 10స. 12 శ్లో.)

సంపూర్ణ జ్ఞానం కలిగిన చక్రాద్యాయుధాలచేత 'విజయీభవ' అని ఉద్ఘోషింపబడిన జయజయధ్వానాలు కలవాడు శ్రీమహావిష్ణువని కాళిదాస కవిసూక్తి. ఆశ్రితుల దుఃఖాలను నివారించేవి సర్వ ప్రహరణాలు. భగవానునేకాక, ప్రత్యేకంగా సుదర్శనాద్యాయుధాలను స్తుతించినా, అవి భక్తులయొక్క సర్వాపదలను నివారింపజేయగల ఐశ్వర్య శక్తి సంపూర్ణమైనవి. భూతవ్రాత రక్షైక దీక్షగలవి, అని 'విష్ణుధర్మం' లోని శ్లోకమే ప్రమాణం.

"అవ్యాహతాని కృష్ణస్యచక్రా దీన్యాయుధాని తమ్ ।
రక్షంతి సకలాపద్భ్యో యేనవిష్ణురుపాసితః ॥"

పాపాలను చేసిన జీవులను 'క్షమింపను', నరకంలోకి త్రోసివేస్తాను' అని కోపోద్రిక్తుడైన భగవానుని వలన వచ్చే ఆపదలను తీర్చి, స్వామిచే అనుగ్రహింపచేయగల సామర్థ్యం కల్గినవని 'రక్షంతి సకలాపద్భ్యః' అనే మాటకు అర్థం - దీని వివరణం 'భగవద్విషయం' (తి.వా.మొ. 6-10-2పా. ఈడు)లో ఉంది.

"నేనెప్పుడైనా కోపిస్తే, నా సహజమైన కృపను మీరు చూచి భక్తులను రక్షించండి" అని పూర్వమే భగవానుడు నియమించడం వల్ల దివ్యాయుధాలట్లే భక్తులను రక్షిస్తాయట.

"అవన్ ప్రసాదం పెత్తవర్‌కళ్ తిరువాషియిల్ కూర్మై యైయిదే తమక్కుత్తంజమాక నినైత్తిరుప్పదు." అనే నంబిళ్ళైగారి సూక్తి వల్ల శ్రియః పతికృపకన్నా, చక్రాద్యాయుధాల కృపమిన్న అని తెలుస్తున్నదికదా!

ఈ దివ్యాయుధాలు, భగవానుని దివ్యమంగళ విగ్రహానికి మణిమకుట హారకేయూరాదులలాగా, ఆభరణాలై భక్తులకు నయనానందదాయకాలు. కల్పతరువు వలె ఆశ్రితుల కోరికలనూ దీర్చగలవు. ఈ దివ్యాయుధాలన్నిటికంటే సుదర్శనాయుధం శ్రేష్ఠమైనది.

"యదాయత్తం జగచ్చక్రం కాలచక్రం చశాశ్వతమ్ ।
పాతు న స్తత్పరం చక్రం చక్రరూపస్య చక్రిణః॥"

'సతత పరిణామాత్మకమైన జనన మరణాల మధ్య పరిభ్రమించేది జగచ్చక్రం. నిమిషాలు, గంటలు, పగలు, రాత్రిగా సతత భ్రమణాత్మకమైనది కాలచక్రం. జగచ్చక్రమూ, కాలచక్రమూ ఏ సుదర్శన చక్రం యొక్క అధీనమై యున్నవో, అట్టి గొప్పదైన, శ్రీమన్నారాయణుని ఆయుధమైన చక్రరాజం మనకు అనిష్టనివృత్తి పూర్వకమైన ఇష్టప్రాప్తిని కలిగించుగాక' యని శ్లోక తాత్పర్యం. (ఇది షోడశాయుధస్తోత్రంలోని చక్రస్తుతి).

ఇట్టి వైభవం కలిగిన 'శ్రీసుదర్శనాష్టకం' అనే ఈ స్తోత్రాన్ని టీకా తాత్పర్య వ్యాఖ్యాన సహితంగా ప్రకటించాలనే సంకల్పం సంస్కృత పండితులైన శ్రీ ఉ.వే.ప్ర. కే.వి. రాఘవాచార్యులకు కలిగింది. ఈ ధనుర్మాస ఉత్తరార్థంలో, జ్వరపీడితులై అనారోగ్యానికి గురియైన ఆచార్యులవారు శ్రమయనక, శ్రద్ధతో, ప్రతిదిన మొక శ్లోకానికి 'జ్వాల' అనే వ్యాఖ్యానాన్ని వ్రాశారు. పదిరాత్రులలో ఈ స్తోత్రాన్ని పూర్తిచేసే సరికి వారికి జ్వరబాధ తగ్గింది. ఈ విషయాన్ని, వారు 22 జనవరి 2004 నాడు, అహోబిలమఠంలో భగవత్ప్రీత్యర్థం శ్రీసుదర్శనయాగం చేసి, వ్రాతప్రతిని స్వామి సన్నిధిలో సమర్పించి, తదీయారాధనకు ముందు మాకు తెలిపినారు. ఈ స్తోత్రాన్ని శ్రీమాలోల గ్రంథమాలా పక్షాన ప్రచురించుమని వారు కోరినందువల్ల, శ్రీమాలోల స్వామివారికి ఆయురారోగ్యాలను

ప్రసాదించుగాక యని స్వామిని ప్రార్థిస్తూ, ఇంక శ్రీ అహోబిల మఠం 45వ పట్టం శ్రీశ్రీవణ్ శఠకోప శ్రీనారాయణ యతీంద్ర మహాదేశికులవారి మంగళాశాసనాలు పరిపూర్ణంగా నుండుగాక అని విన్నవిస్తూ, కృతజ్ఞతలర్పిస్తున్నాము. ఈ స్తోత్రానికి 'ఆముఖం' వ్రాసి యిచ్చిన శ్రీమాన్ పి.ఆర్. రంగరాజన్‌స్వామి వారికి సప్రశ్రయ ప్రణామాలు.

ఈ పుస్తక ముద్రణకై ఉదార హృదయంతో ద్రవ్యాన్ని సమర్పించి, శ్రీ లక్ష్మీనృసింహస్వామి అనుగ్రహానికి పాత్రులైన శ్రీ పోల్ వెంకట్ రాజిరెడ్డిగారికి కృతానేక ధన్యవాదాలు.

పుస్తకమును చక్కగా ముద్రించి యిచ్చిన 'వాగ్దేవి ప్రింటర్స్' అధినేతలకు ఆశీస్సుమాంజలులు.

ఆస్తికలోకం ఈ స్తోత్రాన్ని ప్రతిదినం అనుసంధించుకొంటూ భగవంతుని అనుగ్రహానికి పాత్రమగుగాక.

స్వభాను మహాశివరాత్రి
18, ఫిబ్రవరి, 2004
బుధవారం

ఇట్లు
ప్రకాశకులు
శ్రీమాలోల గ్రంథమాల
శ్రీ అహోబిలమఠం
హైదరాబాదు-13.

**P.R. Rangarajan Swami**
Head of the Dept of Vyakarna (Rtd),
S.V. Oriental College, Tirupathi.

## ఆముఖం

శ్రీ వైష్ణవ ఆచార్యులు శ్రీ వేదాంత దేశికుల వారు రచించిన "శ్రీసుదర్శనాష్టకం అనే స్తోత్ర వ్యాఖ్యానాన్ని చూశాను. "చక్రరూపస్య చక్రిణః" అని వేదాంత దేశికులవారు షోదశాయుధ స్తోత్రంలో చెప్పినట్లు సుదర్శన చక్రత్తాళ్వాన్ సాక్షాత్ పరమ పురుషుడే, అతని మహిమ వాచామ గోచరంగా అనగా మన మాటలకు అతీతంగా ఉన్నది. దేశికులవారు పాదుకాసహస్రంలో

**నిశ్శేషం అంబర తలం యది పత్రికాస్యాత్**
**సప్తార్ణవీ యది సమేత్య మశీ భవిత్రీ**
**వక్తా సహస్రవదనః పురుషః స్వయంచేత్**
**లిఖ్యేత రంగపతి పాదుక యోః ప్రభావః॥**

అనగా, రంగనాథస్వామి పాదుకల మహిమను వర్ణించాలంటే సమస్త ఆకాశం కాగితంగా మారాలట. ఏడు సముద్రాలు మశీ (INK) గా మారాలట. సహస్రవదనుడు, ఆదిశేషుడు వక్తగా ఉండాలట. రంగనాథస్వామి వ్రాయాలట, అప్పుడు కూడా శ్రీ రంగనాథస్వామి పాదుకల యొక్క మహిమను వ్రాయడం సందేహమే అని పేర్కొన్నారు.

శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారు విషయంలో కూడా ఈ శ్లోక విషయాన్ని అనుకోవచ్చు. చక్రత్తాళ్వార్ మహిమను వర్ణించటం కష్టం అన్నమాట.

శ్రీ సుదర్శనాష్టకంలో "ప్రతిభట శ్రేణి భీషణ" అని స్వామి దేశికుల వారు కీర్తించటం చక్రత్తాళ్వారు విషయంలో మాత్రమే కాదు. చక్రత్తాళ్వారును తమ శ్రీ హస్తములో ధరించియున్న భగవంతుని మహిమగా తీసుకోవలయును.

భగవంతునికి వేరుగా శత్రువులు లేరు. భక్తుల విషయంలో ఎవరైతే విరోధ భావాన్ని వహిస్తారో, వారు భగవంతునికి శత్రువులు. ఎవరైతే భగవంతుని దివ్య అజ్ఞను మీరుతారో వాళ్ళు భగవంతునికి శత్రువులు, అటువంటి వాళ్ళకు చక్రత్తాళ్వార్ భయాన్ని కల్గించే విధంగా ఉంటున్నారు. ఈ చక్రత్తాళ్వార్ సమస్త కల్యాణ గుణములతో కూడినవాడు. ఆగమ శాస్త్రంలో చెప్పిన రీతిగా భగవంతునికి వుండే కల్యాణ గుణములు చక్రత్తాళ్వారునకు కూడానున్నవి. వాత్సల్యం, రక్షకత్వం, ఆపత్సఖత్వం మొదలైన కల్యాణ గుణములు చక్రత్తాళ్వార్ విషయంలో చెప్పవచ్చు.

ఈ గ్రంథంలో వాఖ్యాత శ్రీమాన్ కె.వి. రాఘవాచార్య స్వామి తమ అభిప్రాయాన్ని చక్కగా వివరిస్తున్నారు. ఇతరులకు స్ఫురించని కొన్ని అంశాలను ఈ గ్రంథంలో వాఖ్యానించి యున్నారు. భక్తులు ఈ గ్రంథాన్ని సేవించి సుదర్శన చక్రత్తాళ్వార్ దివ్య అనుగ్రహాన్ని పొందవలయునని ప్రార్థిస్తున్నాను.



శ్రీమతేరామానుజాయనమః
శ్రీమన్నిగమాంత మహాదేశికాయనమః
శ్రీ సుదర్శనాయనమః

# శ్రీసుదర్శనాష్టకమ్

## (జ్వాలా వ్యాఖ్యా సహితం)

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।
వేదాంతాచార్య వర్యోమే సన్నిధత్తాంసదాహృది॥
రామానుజదయా పాత్రం జ్ఞానవైరాగ్య భూషణమ్।
శ్రీ మద్వేం కటనాథార్యం వందే వేదాంతదేశికమ్॥

శ్రీ వేంకటేశ ఘంటావతారులనీ, సర్వతంత్ర స్వతంత్రులనీ, కవితార్కిక కేసరి అనీ ప్రసిద్ధి నొందినవారు వేంకటనాథాచార్యులనే వ్యవహారనామం కల్గిన వేదాంతదేశికులు.

దేశికులు గరీయః ప్రతిభతో రచించిన అనేక స్తోత్రాలలో సుదర్శనాష్టకమొకటి.

ఇష్ట ప్రాప్తినీ, అనిష్టనివృత్తినీ కలిగించే ఈ స్తుతిని దేశికులు రచించడానికి రెండు కారణాలను విజ్ఞులు వివరించారు.

1. "తిరుప్పుళ్ కుషి" అనే దివ్యదేశానికి సంస్కృత నామం 'గృధ్రసరస్తీరం' ఈ దివ్య క్షేత్రంలో నివసించిన భక్తజనావళికి శీతజ్వర బాధ కలిగినప్పుడు ఆ బాధను తొలగించడానికి శ్రీ సుదర్శన భగవానుణ్ని ఎనిమిది (8) శ్లోకాలతో స్తుతించి, యోగక్షేమాలను కల్పించారట.

**"శ్రీమత్ గృధ్ర సరస్తటావనిజుషాం శ్రీ వైష్ణవానాం పురా**
**యః శీత జ్వరనుత్తయే వ్యతనుత శ్రీ హేతిరాజాష్టకమ్॥"**

2. 'పరమతభంగం' అనే ఒక శాస్త్రగ్రంథాన్ని నిర్విఘ్నంగా పూర్తిచేయడానికి, ముందు సుదర్శన భగవానుని అనుగ్రహాన్ని పొందదలచిన దేశికులు 'శ్రీ సుదర్శనాష్టకం' అనే ఈ స్తోత్రాన్ని రచించి, సిద్ధిని పొందారట.

I **ప్రతిభటశ్రేణి భీషణ, వరగుణ స్తోమభూషణ!**
**జనిభయ స్థాన తారణ, జగదవస్థాన కారణ!**
**నిఖిల దుష్కర్మకర్శన, నిగమసద్ధర్మ దర్శన!**
**జయ జయశ్రీ సుదర్శన, జయ జయ శ్రీ సుదర్శన**

**అర్థం** :- ప్రతిభట శ్రేణి భీషణ ! ప్రతిభట=శత్రుయోధులయొక్క; శ్రేణి=పంక్తికి-సమూహానికి; భీషణ=భయంకరుడా! వరగుణస్తోమ భూషణ! వరగుణ=శ్రేష్ఠ గుణాలయొక్క; స్తోమ=సముదాయాన్ని; భూషణ=అలంకారంగా కలిగిన వాడా! జనిభయస్థాన తారణ! జని భయ=జన్మ మనే భయానికి; స్థాన=చోటు అయిన సంసారం నుంచి; తారణ=దాటించు వాడా! జగత్+అవస్థాన కారణ! జగత్=లోకాల యొక్క; అవస్థాన=స్థితికి; కారణ=హేతువైనవాడా! నిఖిల దుష్కర్మ కర్శన! నిఖిల=సమస్త; దుష్కర్మ=దుశ్చరితాలను; కర్శన=కృశింపజేయువాడా! నిగమ సత్ ధర్మ దర్శన! నిగమ=వేదాలయందలి; సత్=మంచి-గొప్ప; ధర్మ=ధర్మాలను; దర్శన=చూపించేవాడా! శ్రీ సుదర్శన! శ్రీ=సంపత్కరమైన; సు=చక్కని; దర్శన=రూపం కలవాడా! జయ, జయ=సర్వోత్కర్షంగా వెలుగుమా! శ్రీ, సుదర్శన=శోభనమైన; 'సుదర్శన' నామధేయుడా! జయ, జయ=లోకంనమస్కరించే రీతిగా ఉజ్జ్వలుడవై యుండుమా!

**తా ॥** శత్రువర్గానికి భయాన్ని కలిగించేవాడా! కల్యాణగుణా భరణుడా! సంసారమనే సముద్రం నుంచి తరింపచేసే వాడా! సకల జగత్తును రక్షించేవాడా! సమస్త పాపాలను నశింపజేసేవాడా! వేదవిహితమైన సద్ధర్మ మందు ప్రవర్తించేవాడా! ఓ సుదర్శన భగవానుడా! విజయీభవ.

**జ్వాలా వ్యాఖ్య :-** శ్రీ సుదర్శన భగవానుని తేజస్సు అప్రమేయం. శ్రీ మన్నారాయణుని శ్రీ హస్త పద్మమందు వెలసి, నిరంతరం తన అగ్రభాగాలన్నీ నేతితో పూయబడినట్లు పదునెక్కి మెరుస్తూ కాలమేఘంలాగా ఉండే భగవానుని దివ్యమంగళ విగ్రహానికి నిరుపమానమైన దీప్తిని కల్గించేది సుదర్శన తేజస్సు.

**"జ్యోతిష్మత్ భ్రాజమానం మహస్వత్" (శ్రుతి)**

**"తీయిల్ పొలిగిన్ఱ శెమ్ శుడరాషి తికష్ తిరుచ్చక్కరత్తిన్"**

**-(తిరుప్పల్లాణ్డు)**

చంద్ర, ఆదిత్య, అగ్నికంటెను అధికంగా ప్రకాశించేది సుదర్శన మూర్తి. అది 'స్ఫురత్ సహస్రారశిఖాతి తీవ్రమ్' అని స్తుతింపబడేది కదా!

ఇరుకైన చోట నీటి ప్రవాహం ఎక్కువైతే వేగం వల్ల సుడులేర్పడే విధంగా, సుదర్శనమూర్తిలోని తేజః ప్రవాహానికి చోటు చాలక, ఆ మూర్తి లోపలనూ, చుట్టునూ తిరుగుచుండడం వల్ల గుండ్రని ఆకారమేర్పడిన తేజో వైభవం కలవాడు సుదర్శన భగవానుడు - అని పెరియాళ్వార్ల పై సూక్తిలోని 'ఆషి, శక్కర' అనే పదాలకు పునరుక్తి దోషం లేదని పెరియవాచ్చాన్ పిళ్ళై' వ్యాఖ్య "పఱ్పనాబన్ కైయిల్ ఆషిపోల్ మిన్ని" (తిరుప్పావై) పద్మనాభుని చేతి యందు మించు లీనుతూ స్వామి ఆనందాన్ని ప్రకటించేది సుదర్శనుని స్వరూపమని గోదాదేవి తెలిపింది కదా!

శ్రియః పతి సంకల్పానుగుణంగా ప్రతికూలురైన దుష్టులను, భక్తుల

విరోధులనూ సంహరించేవాడు సుదర్శనుడు. మధుకైటభులను తెగనరికినవాడు. దేవతలను బాధిస్తూ, పాతాళంలో నివసించిన రాక్షసులను సంహరించాడు.

**"పాతాళాంతఃప్రపాతీ నిఖిలమపితమఃస్వేనధామ్నానిగీర్య"**

అన్నది కదా! సుదర్శన శతకం (29). భగవద్భక్తుడైన అంబరీషుణ్ని శిక్షించడానికి 'కృత్య'ను సృష్టించి పంపిన దుర్వాసునికి భయంకరుడై 'కృత్య'ను దహించాడు. "దదాహ కృత్యాం తాం చక్రం కృద్ధాహిమివ పావకః" **(భాగవతం)**

**2.వరగుణ స్తోమభూషణుడు :–** షాడ్గుణ్యమూర్తియైన శ్రీ మన్నారాయణునికి శేషభూతుడై, సర్వవిధ కైంకర్యనిరతుడైన సుదర్శనుడు కూడా జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజః కల్యాణ గుణగణుడు. "పరమం సామ్యం ఉపైతి" (శ్రుతి.) **"తమ్మైయేనాళుమ్ వణంగిత్తొషువార్క్కు తమ్మైయే యొక్క అరుళ్ శెయ్‌వర్"** అని ఉభయ వేదాంత సూక్తులు కీర్తించినట్లు భగవత్కైంకర్య పరుడు భగవంతునితో సామ్యాన్నీ, సాధర్మ్యాన్నీ పొందుతాడు. "సర్వప్రహరణాయుధః " (వి.స.నా) అసాధారణ సామర్థ్యంగల చక్రాద్యాయుధాలు భగవంతునికి దుష్ట శిక్షణ కోసం ఆయుధాలుగానూ, శిక్షణా వశ్యకత లేనప్పుడు ఆయన దివ్యమంగళ విగ్రహానికి సౌందర్యాన్ని ఇమ్మడించే ఆభరణాలుగానూ శోభిస్తాయి, అని శ్రీ పరాశరభట్టర్ వ్యాఖ్య. "కృష్ణాంభోదస్యభూషా" అని సుదర్శన శతకం (30) కీర్తిస్తుంది.

**"శుడరాషిశంగేంది" (తి.వా.మొ. 2.3.10) పరమదత్తిల్ ఆభరణ మాయ్ కాట్చిత్తరుమ్, ఇంగాయుధ మాయితే యిరుప్పదు (ఈడు)** అనే నమ్మాళ్వార్ల సూక్తి వల్ల వైకుంఠంలో శ్రియఃపతికి సుదర్శనం ఆభరణంగానూ, ప్రపంచంలో ఆయుధంగా ఉంటుందని విశదమవుతున్నది. ఇలా భగవద్దీప్తిని ఉత్తేజపరచే తన గుణాలే తనకు అలంకారంగా కలవాడు. సుదర్శన

భగవానుడు.

**3. జనిభయస్థాన తారణుడు** :- జనన మరణ చక్రంలో పడి పరిభ్రమించే జీవులను దాని నుంచి తప్పించి కాపాడేది సుదర్శనం.

**"చమూష చ్ఛ్యేనః శకునో భిభృత్వా**
**గోవిదు ద్రధ ఆయుధాని బిభ్రత।**
**అపామూర్మింసచమానః సముద్రం**
**తురీయం ధామ మహేషో వివక్తి॥" శ్రుతి.**

భగవంతుని అంశభూతుడైన జీవాత్మ పాంచభౌతిక శరీరం కలవాడు. (చక్రాయుధం అనగానే శంఖం కూడా ఉపలక్షకమే) కాబట్టి శ్రియః పతిధరించే చక్రాయుధంచేత చిహ్నితుడై, అంటే తప్త చంక్రాంకితుడైన జనుడు, స్తుతింపదగిన పరమాత్ముని సన్నిధిని అవశ్యంగా పొందుతాడు. సంసారమనే సముద్రం యొక్క తీరాన్ని చేరడానికి తాను సమర్థుడవడమేకాక, తన బంధువులను కూడా తరింపజేయగల్గుతాడు. జనుడు చచ్చి మళ్ళీ పుట్టబోడు. అన్ని లోకాల కంటె ఉన్నతమైన, ఉత్తమమైన పరమపదాన్ని -మోక్షస్థానాన్ని -పొందుతాడని ఋగ్వేదం బోధిస్తున్నది.

**4. జగదవ స్థానకారణుడు** :- విశ్వంభరుని చేతి చక్రం, కాలచక్రాన్ని త్రిప్పుతు మూడులోకాలను అజ్ఞానమనే అంధకారాన్ని తరిమివేసి కాపాడుతుంది. **"విశ్వం విశ్వం భరాధ్యం రథ పదధిపతేః లీల యా పాలయంతీ"**- (సుదర్శనశతకం.15) **"కాలశక్కరత్తానుక్కే"**- ఆళ్వార్ల శ్రీ సూక్తి.

**5. నిఖిల దుష్కర్మకర్శనుడు** :- పాపాలనన్నిటినీ నశింపజేసేవాడు. పాపాలను చేసేవారి నందరినీ నశింపజేస్తాడు. అందరి పాపాలనూ ధ్వంసం

చేసేవాడు సుదర్శన భగవానుడు.

**"చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతాః తర తిదుష్కృతాని। తేన పవిత్రేణ శుద్ధేన పూతాః అతిపాప్మానమరాతింతరేమ"** పవిత్రమైన పురాతనమైన సుదర్శనునిచే పవిత్రుడైన జీవుడు పాపాలనన్నిటిని దాటగలుతాడు. ఆ సుదర్శనమే పాపాలనే శత్రువులనుంచి మనలనూ పవిత్రీకరించి ముక్తులను చేస్తుందని ఈ వేదమంత్రార్థం.

భూదేవి విష్ణువుల సంతానమైన నరకాసురుడు పదహారు వేల స్త్రీలను చెఱలో పెట్టాడు. వరుణుని ఛత్రాన్నీ, అదితికుండలాలనూ అపహరించిన నరకుని తలను సుదర్శనమే నరికివేసింది.

**"తద్విసర్గాత్ పూర్వమేవ నరకస్య శిరోహరిః।**
**అపాహరత్ గజస్థస్య చక్రేణక్షురనేమినా" ॥**

అన్న భాగవతమే ప్రమాణం. పాపరాశివల్లనే పాపపుబుద్ధులు పుడుతాయి. తత్ఫలితంగా పాపాలను చేసే నరకాసురుని లాంటి వారినీ నాశనం చేస్తాడు సుదర్శన భగవానుడు. కోటి సూర్య సమప్రభుడైన సుదర్శనుడు పాపమనే చీకటిని చీల్చివేస్తాడు. తమః ఖండనమే సుదర్శనుని కృత్యం.

**6. నిగమ సద్ధర్మదర్శనుడు :-** వేదరాశియందు విహితమైన ధర్మం శరణాగత వాత్సల్యమే. ధర్మజ్ఞుడు, శరణాగత వత్సలుడు భగవానుడు "ఎప్పోదుమ్ కైక్కషలానేమియాన్" – అన్నట్లు సంతతం భగవానుని **చేతిని విడువక** ఉంటూ, ఇంగితజ్ఞుడై కైంకర్యం చేసే స్వరూపంగల **సుదర్శనమూర్తి**కి కూడా భగవద్గుణాలు సంక్రమించడం సహజమే. **ఉష్ణగుణం కలి**గిన అగ్నిహోత్రుని ఉపాసించే (దగ్గరకూర్చుండే) వ్యక్తి శరీరం**కూడా వేడె**క్కడం వింతకాదుకదా! "ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" **అని పురుషోత్తముని** స్వరూపధర్మాన్ని వేదం

విశదం చేస్తుంది. శ్రీరామ చంద్రమూర్తి కాకాసురుని మీద ప్రయోగించిన దర్భగడ్డి పరక, హేతిరాజమై ధగధగ ఉజ్జ్వలిస్తూ అతణ్ని తరిమిందే కాని దహించలేదు. సర్వలోకపాలకులను అతడు ఆశ్రయించినప్పుడు వేచియుంది. వారెవ్వరూ కాపాడలేక విడిపెట్టినప్పుడు మళ్ళీ పరుగెత్తుతున్న అతని వెంటబడి బుసలు గొట్టింది. బుగులు పుట్టించింది. స్వామిపాదాల మీదపడి శరణాగతుడయ్యే రీతిగా అతని మనశ్చక్రాన్ని త్రిప్పింది కదా! అంటే, 'శరణాగతి' ధర్మాన్ని తాను ఆచరించి, తక్కినవారూ ఆచరింపజూపే తత్త్వం కలది సుదర్శనాయుధం. "శోభనం దర్శనం యస్యసః సుదర్శనః" అని ఆశబ్దవ్యుత్పత్తి. 'దర్శనం' అంటే ఆశ్రిత రక్షణ రూపమైన తత్త్వం. అది కలవాడు సుదర్శుమడన్నమాట.

"శోభనం దర్శనం యేన సః=సుదర్శనః. ఎవని చేత తత్త్వం (స్వరూపదర్శనం) కలుగునో అతడు సుదర్శనుడు. "అనన్యశేషత్వం, అనన్య శరణత్వం, అనన్యభోగ్యత్వం" అనే ఆకారత్రయ సంపత్తిని కలిగి యుండడమే జీవుని స్వరూపం. కాబట్టి, సుదర్శన భగవానుని ఉపాసన చేస్తే జీవునికి స్వస్వరూపజ్ఞానమూ, పరస్వరూప జ్ఞానమూ కలుగుతుందని సారార్థం. "అఱుముయలాషి" - అనే ఆళ్వార్ల సూక్తికి **"ఆశ్రితరక్షణ మాకిఱపరమ ధర్మత్తిలేముయలా నిన్ఱుళ్ళ తిరువాషి"** అని ఆచార్యులు వ్యాఖ్యానించిన విషయమే ఇది.

శ్రీ వేదాన్త దేశికులు శ్రీ సుదర్శనాష్టకస్తోత్రాన్ని వ్రాసిన తర్వాత ఈ స్తోత్రానికి సంగ్రహరూపంగా ఒక ద్రావిడ పాశురాన్ని అనుగ్రహించారు.

**"ఎణ్ణల వమ్ముయత్తుళ్ ఇలఙ్గుమ్మఱు కోణమిశై**
**వణ్ణణిలన్తికిరి వళైవిల్ వలైవాయ్ ముశలమ్ ।**
**తిణ్ణెయిలఙ్కుశ శ్ఞేర్తికషుఙ్గదై శెఙ్కమల**
**మెణ్ణడై యేన్దినిన్ఱాన్ ఎషిలాషియిఱైయవనే ॥"**

శ్రీసుదర్శన భగవానుడు, ఎనిమిది దళాలు కలిగిన తామరకమలంలోని ఆఱుకోణాలు కలిగిన యంత్రంలో, ఎనిమిది భుజాలలో శంఖం, చక్రం, విల్లు, పరశు, రోకలి, అంకుశం, గద, పద్మంఅనే ఎనిమిది ఆయుధాలను ధరించి ప్రకాశిస్తున్నాడు. (తాత్పర్యమిది)

ఈ పాశురంలో శ్రీ సుదర్శనుడు అష్టభుజుడనీ, అష్టాయుధాలను ధరించినట్లు స్తుతించారు దేశికులు. కాబట్టి, శ్రీ సుదర్శనాష్టకంలోని ఎనిమిది శ్లోకాలలో ఎనిమిది ఆయుధాల పనులను సూచించారని, ద్రావిడ వ్యాఖ్యాత సూచించినట్లు శ్రీమాన్ ఐ.భాష్యకారాచార్యులు తమ వ్యాఖ్యానంలో విశదపరిచారు.

ఈ మొదటి శ్లోకంలో శంఖం యొక్క కార్యం సూచితం.

'ప్రతిభటశ్రేణి భీషణ' పదానికి శంఖం యొక్క ధ్వని శత్రువుల గుండెలు వ్రయ్యలయ్యే రీతిగా భయాన్ని కలిగిస్తుంది, అని అర్థం. "విష్ణోర్ముఖోత్థానిల పూరితస్య యస్య ధ్వనిర్దానవ దర్పహంతా" !! అనే సూక్తి ఉందికదా! అంతే కాదు; శ్రీకృష్ణ భగవానుడు పూరించిన శ్రీపాంచజన్య ఘోష కురుక్షేత్రంలో ధార్తరాష్ట్రుల హృదయాలను దద్దరిల్ల జేసిందని శ్రీ భగవద్గీతలో తెల్పబడింది. సద్గుణాలు కలది శంఖం. సంసారోత్తారకమైనది. సకల పాపరాశిని ధ్వంసం చేసేది. ధ్రువునికి వలెనే ఆశ్రితులకు జ్ఞానాన్ని కలిగించేది.

**"అగ్నేర్మన్వే ప్రథమస్య ప్రచేత సోయం పాంచజన్యం బహవస్సమింధతే"** – ఇత్యాది వేద సూక్తులచే కీర్తింపబడింది. ధవళ వర్ణంతో సొబగైన రూపం కలిగి ఉపాసకులకు ముక్తిని ప్రసాదించే ఓ పాంచజన్యమా! జయము, జయము! నమస్కారము శ్లోకంలోని విశేషణాలను బట్టి ఈ విధంగా అర్థం చమకిస్తుంది. ఇతర శ్లోకాలలోనూ ఇతర ఆయుధ కార్యాలను ఇలాగే గమనించ వచ్చును.

7. జయ జయశ్రీ సుదర్శన 8. జయ జయ శ్రీసుదర్శన! ఒక్కమాటను రెండుసార్లు ప్రయోగించడం వల్ల అది దేశికుల యొక్క ఆదరాతి శయాన్ని తెల్పుతున్నది. మొదటి జయ జయ– సుదర్శనుని పట్ల 'సర్వోత్కర్షప్రాప్తి' 'అనే మంగళాశాసనాన్ని బోధిస్తుంది. రెండవ జయ, జయ' – భక్తిశ్రద్ధలతో చేసే నమస్కారాన్ని తెల్పుతుంది 'జి–జయే' అనే ధాతువునకు విశేషార్థాన్ని ఆహిర్బుధ్న్య సంహిత ఇట్లే నిర్వచించింది.

"ఔజ్వల్య మవిఘూతశ్చ జయతేరర్థ ఉచ్యతే ।
ప్రయోజకం తదుభయం నంతుం నమనకర్మణి ।
జ్ఞానశక్తిబలాద్యై స్తదుభయం ఖలు జాయతే ॥"

**II** **శుభజగద్రూపమండన, సురజనత్రా సఖండన**
**శతమఖ బ్రహ్మ వందిత, శతపథ బ్రహ్మనందిత ।**
**ప్రథిత విద్వత్సపక్షిత, భజదహిర్బుధ్న్య లక్షిత**
**జయ జయ శ్రీసుదర్శన, జయ జయ శ్రీసుదర్శన ॥**

**అర్థం** :- శుభజగద్రూప మండన! శుభ=శుభాశ్రయమైన; జగత్+రూప=విరాడ్రూపానికి; మండన=అలంకారమైనవాడా! సురజన త్రాసఖండన। సురజన=దేవజనులకు; త్రాస=భయాన్ని; ఖండన= నశింపజేయువాడా! శతమఖ బ్రహ్మవందిత। శతమఖ= ఇంద్రునిచేతను; బ్రహ్మ=చతుర్ముఖ బ్రహ్మచేతను; వందిత=నమస్కరింప బడినవాడా! శత పథబ్రహ్మ నందిత । శతపథబ్రహ్మ=శతపథబ్రాహ్మణమనే ఉపనిషత్తుచే; నందిత=కీర్తింపబడిన వాడా! ప్రథిత విద్వత్స పక్షిత। ప్రథిత=ప్రసిద్ధులైన; విద్వత్=పండితులచే; సపక్షిత=తమవైపు చేర్చుకొనబడిన వాడా। భజదహిర్బుధ్న్య లక్షిత। భజత్=తనను సేవించే; అహిర్బుధ్న్య= అహిర్బుధ్న్యచేత;

లక్షిత=లక్షింపబడిన వాడా!శ్రీ సుదర్శన=శోభనమైన దర్శనం (రూపం) కలవాడా! జయం, జయం=సర్వోత్కర్షతో ప్రకాశించువా! శ్రీ సుదర్శన=సంపత్కరమైన 'సుదర్శను' డనే పేరుగల చక్రమా! జయ, జయ=విజయుడవై మానమస్కృతిని గొనుమా!

**తా ॥** విశ్వరూపుడైన సర్వేశ్వరునికి అలంకారంగా ఉన్నవాడా! దేవతలకు కలిగే భయాన్ని తొలగించేవాడా! "శతపథ" మనే వేదాంతశాస్త్రంచేత కొనియాడబడిన వాడా! బ్రహ్మేంద్రాదులచేత నమస్కరింపబడేవాడా! ప్రసిద్ధ పండితుల పక్షాన చేర్చబడే వాడా! అహిర్బుధ్న్యునిచే సేవింపబడేవాడా! సుదర్శనుడా! జయ జయ!

**జ్వాలా వ్యాఖ్య :-** వేదపాంచరాత్రాది శాస్త్రప్రతిపాద్యుడు సుదర్శనుడు. శుభకరుడైన, చరాచర శరీరుడై జగదాకారుడైన శ్రీ మహావిష్ణువుకు అలంకారమైనవాడు. భగవంతుని వ్రేలుకు ఉంగురంగా మొదల్కొని చేతులకు కంకణాలుగాను, బాహువులకు వలయాలు (దండకడియాలు) గాను శోభించే అభరణ భూతుడు సుదర్శనుడు. "పొన్నాషిక్కైయార్కు" అనే నమాళ్వార్ల సూక్తికి "తిరుక్కైక్కు వళైయమ్ ఇరుక్కుఅపడి" అని నంబిళ్ళైగారు వివరించారుకదా! **"ఉన్మీలత్ పద్మరాగం కటక మివధృతం బాహునా యన్మురారేః"** అని సుదర్శన శతక సూక్తి.

"విష్ణుర్భూత్వా విష్ణుమర్చయేత్" అన్నట్లు, విష్ణుమూర్తిని పూజించడానికి భక్తులు అట్టి స్వరూపాన్నే ధరించవలసి యుటుంది. విష్ణుభక్తులు కూడా తమ భుజాలకు తప్త (శంఖ) చక్రలాంఛనాలను కలిగియుంటారు. "ఆషియాన్‌తమర్" అని భగవద్భక్తులను నిర్దేశించారాళ్వార్లు... "చక్రాదిధారణం పుంసాం పరసంబంధ వేదనమ్। పతివ్రతా నిమిత్తం హి వలయాది విభూషణమ్॥"

కంకణా ద్యాభరణాలను ధరించినస్త్రీని 'మగనాలు' (పతివ్రత) అని సమాజం గుర్తిస్తుంది. అలాగే (పాంచజన్య) సుదర్శనాంకితులైన జనులను విష్ణు సంబంధులు-వైష్ణవులు-అని గమనిస్తుంది లోకం. 'చక్రపాణి' కే కాక ఆయన భృత్యులకునూ సుదర్శనం ఆభరణమే.

**2. సురజన త్రాసఖండనుడు :-** దేవతలకు రాక్షసుల వల్ల కలిగే భయాన్ని పోగొట్టేవాడు సుదర్శనుడు. అమృతం కోసం సముద్ర మధనం తర్వాత సురాసురుల మధ్య భీకరయుద్ధం జరిగింది. అప్పుడు సర్వేశ్వరుడు దేవతల పక్షాన నిలిచి, అనేక రాక్షసులను సుదర్శనాయుధంతో సంహరించాడు.

"దహత్ క్వచిత్ జ్వలన సమానవర్చసం, పునఃపునర్వ్యప తత వేగవత్తదా।
విదారయత్ దితి దనుజాన్ సహస్రశః, కరేరితం పురుషవరేణ సంయుగే॥"
(భారతం)

దేవతల వలె రూపాన్ని ధరించి అమృతాన్ని పానం చేసిన రాహువు తలను విష్ణుమూర్తి చక్రాయుధంతో ఖండించాడు. దేవతలను నిర్భీకులను చేశాడు. అంతేకాదు, విభవావతారంలోను భగవానునికి, శిశుపాలుడు, పౌండ్రక వాసుదేవుడు, కాలనేమి అనే మొదలైన దుష్టులను సంహరించడానికి తోడ్పడినది సుదర్శనమే కదా!

కాశీ నగరాన్ని కాల్చి వేసింది సుదర్శనమే " దగ్ధ్వావారాణ సీం సర్వాం విష్ణు చక్రం సుధర్శనమ్ "- (భాగవతం) పురాణాలలో దుష్టశక్తులను దునిమి, శిష్టులకు అభయాన్ని కల్పించిన, సుదర్శన పరాక్రమాన్ని తెలిపే కథలెన్నో ఉన్నాయి.

**3. శతమఖ బ్రహ్మానందితుడు :-** శత మఖుడంటే దేవరాజు, నూటు యజ్ఞాలను పూర్తిచేసి ఇంద్ర పదవిని పొందినవాడు. రాక్షసులను, రాక్షసాంశ

వల్ల జన్మించిన దుర్జనులను విష్ణు చక్రం ధ్వంసం చేసినప్పుడు బ్రహ్మేంద్రాది దేవతలందఱు సుదర్శనుని పరాక్రమాన్ని స్తుతిస్తూ ప్రణతులర్పించారు.

**4. శత పథ బ్రహ్మ నందితుడు :-** శతపథబ్రహ్మ అంటే ఆధర్వ వేదానికి సంబంధించిన శతపథ బ్రాహ్మణం, శతశాఖలు కలిగిన ఋగ్వేదం. నూఱు దశకాలు కలిగిన 'తిరువాయ్‌మొషి' అనే దివ్యప్రబంధం. ఇట్టి శతపథ బ్రాహ్మణం చేత కీర్తింపబడిన వాడు, ప్రతిపాదింపబడిన వాడని అర్థం.

"చక్రంబిభర్తి వపుషాభితప్తం, బలందేవానా మమితో ౭స్యవిష్ణోః।
స యాతి నాకందురితాన్ విధూయప్రయాంతి యద్యతయో వీతరాగాః ॥"

తప్తమైన శ్రీవిష్ణుమూర్తి యొక్క చక్రం వల్ల దేవతలకు బలం కలుగుతుంది. ఆ చక్రాన్ని ధరించే వారు పాపాలను దులుపుకొని, వైరాగ్యం కలవారై వైకుంఠ చేరుతారు; అని శ్రుత్యర్థం.

"దేవా సః పితరో యే విధృతేన బాహునా సుదర్శనేన ప్రయాతాః స్వర్గలోక మాయన్, యేనాంకితో మానవోలోక సృష్టింవితన్వంతి, బ్రాహ్మణాస్త ద్వహంత్యగ్ని నా వైహోత్రా తప్తం చక్రం ద్విభుజే ధార్య మిత్యూర్ధ్వ పుండ్రమాలి ఖేత్తస్మాద్ద్వి రేఖంభవతి, పునరాగమనం నయాతి, బ్రహ్మణః సాయుజ్యం సలోకతాం జయతి, య ఏవం వేద" (శతపథబ్రాహ్మణం)

దేవతలు, పితృదేవతలు సుదర్శన చక్రలాంఛితులై వైకుంఠాన్ని చేరుతారు. మనువుకూడా చక్రాంకితుడై లోకసృష్టిని చేశాడు. అగ్ని తప్త (శంఖ) చక్రముద్రలను భుజాలయందు ధరించి,ఊర్ధ్వ పుండ్రధారులైన ద్విజులు పరమపదాన్ని చేరుకొంటారు.

చక్రలాంఛితుడైన మానవుడు పునర్జన్మను పొందలేడు. విష్ణుసాయుజ్యాన్ని పొందలగడు. ఈ ప్రవృత్తిని తెలుసుకొన్న వారందఱు సదాచార పరులై, (శంఖ) చక్రముద్రితులై, మోక్ష సామ్రాజ్యాన్ని పొందుతారు, అని మంత్రార్థం.

**"యావైయుమ్ యావరుమాయ్నిన్ఱ మాయన్ ఎన్నాషిప్పిరాన్" (తి.వా)**
సుదర్శనాయుధుడే చరాచర రూపంగా పరిణమించాడు, అనే నమ్మాళ్వార్ల సూక్తివల్ల సృష్టి కార్యమందు 'వెల్పోరాషి' (తి.వా.మొ) యుద్ధరంగంలో జయింపక తిరిగిరానిది సుదర్శనం, అని పొగడబడింది.

**5. ప్రథిత విద్వత్ సపక్షితుడు :-** ఆళ్వార్లు, ఆచార్యులు, విద్వాంసులైన భక్తులు సుదర్శనాన్ని ఉపాసించి, తమకు అనుకూలంగా చేసుకొని శ్రియఃపతినిస్తోత్రం చేశారు. ఉదాహరణకు :- **"తిరుమాలురువొక్కుమ్ మేరువమ్మేరువిల్ శెమ్ శుదరోన్ తిరుమాల్ తిరుక్కై తిరుచ్చక్కర మొక్కుమ్" (తి.వి)**

భగవంతునిది వ్యరూపాన్ని వర్ణిస్తూ, లక్ష్మీపతిని మేరు పర్వతంతోనూ, ఆయన చేతియందు ధరించిన సుదర్శన చక్రాన్ని సూర్యుని తోనూ పోల్చి కీర్తించారు.

**"ఎత్తవమ్ శెయ్దార్క్కుమ్ ఆరుళ్ ముడివదు ఆషియాన్ పోల్".** (నాన్ముకన్ -2) కర్మజ్ఞాన భక్తి యోగాద్యుపాయాలు సిద్ధించడానికి కారణమైన భగవంతుని దయకు మూలం సుదర్శనం, అని చక్రాంశతో అవతరించిన శ్రీ భక్తిసారులు (తిరుమళిశైయాళ్వార్లు) పొగడడం విశేషం.

"ఉన్ శక్కరప్పొటి యొత్తిక్కొణ్ణు" స్వామీ! నా ఆత్మను, శరీరాన్నీ మీ చక్రం చేత ముద్రితం చేసి మీ కృపనే అభిలషిస్తున్నాను, అన్నారు విష్ణుచిత్తులు (శెన్నియోంగు).

"శంగొడు శక్కరమేన్దుమ్ తడక్కైయన్" (తిరుప్పావై) శంఖంతో కూడిన చక్రాన్ని ధరించిన విశాల సుందర హస్తుడు, అని గోదాదేవి శ్రీ సూక్తి.

"కైత్తలత్తాషియుమ్ శంగముమ్ ఏన్ది"- శ్రీహస్తాల యందు సుదర్శన చక్రాన్ని, దక్షిణావర్త శంఖాన్ని ధరించి మా యెదుట సాక్షాత్కరించాడు స్వామి.

(రామానుశనూత్తందాది)

"చక్రం జాజ్వల్యమానం దధ దవని ధర ప్రఖ్యభవ్యోరుదేహమ్"-

**"హస్తే సుదర్శన మివాత్త తటిత్ ప్రభావాన్"**

**"శంఖరథాంగ కల్పకధ్వజార విందాంకుశ వజ్రలాంచనమ్"**

చక్రపాణీ ! "వచ్చె సుదర్శనాయుధుడు" ఇత్యాది సూక్తులు సుదర్శన వైభవాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

**6. భజదహిర్బుధ్న్య లక్షితుడు** :- అహిర్బుధ్న్యుడు అంటే రుద్రుడు. "అష్టమూర్తి రహిర్బుధ్న్యో మహాకాలో మహానటః" (అమరం)

పాంచరాత్ర శాస్త్రమందు చెప్పబడిన రుద్రనిచే తెలుసుకోబడిన మహిమకలవాడు సుదర్శన భగవానుడు. 'అహిర్బుధ్న్య ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ సుదర్శనోదేవతా" ఇత్యాదిగా ఉన్న శ్రీ సుదర్శన మాలామంత్ర ప్రసిద్ధిని బట్టి, "భజదహిర్బుధ్న్య లక్షిత" అని సంబోధింపబడింది.

"కింతత్ సుదర్శనం నామ కశ్చ శబ్దార్ధ ఉచ్యతే" నారదుడు సుదర్శన మంటే ఏమి? ఆ శబ్దం యొక్క అర్ధమేమి? అని పరమేశ్వరుణ్ని అడిగాడు. అందుకు ఆయన ఇలా బోధించాడు.

**"తస్యస్యామితి సంకల్పోభావతో ౨భావతో ౨పివా।**
**స్వాతంత్ర్యాననుయోజ్యేన రూపేణ పరివర్తతే। యత్తత్ ప్రేక్షణ**
**మిత్యుక్తం దర్శనం తత్ ప్రగీయతే । వస్తుతః కాలతో దేశాత్**
**తస్యత్వవ్యాహతిర్విమా। పూజాసాతు సుశబ్దార్థః**
**తత్ సుదర్శన మీర్యతే ॥" (అహిర్బుధ్న్య సంహింత)**

**శ్రీ మహావిష్ణువు యొక్క సంకల్ప రూపమైన ఈక్షణమే దర్శన శబ్దార్థం. ఆ వీక్షణమే చేతనాచేతన రూపంగా పరిణమించడానికి కారణమయింది. ఆ**

దర్శనానికి విషయకాల దేశ పరిమితులు లేవనడమే "సు" శబ్దం యొక్క అర్థం.

మనస్సే చక్రాయుధమని చెప్పింది విష్ణుపురాణం. మనస్సు నుంచి పుట్టేది సంకల్పం. ఇలాగా భగవంతుని సంకల్ప రూపమే చక్రాయుధ మని విశదమవుతున్నది.

అహిర్బుధ్న్య సంహితలో సుదర్శనోపాసన మహిమను తెలిపే గాధలెన్నో ఉన్నాయి. మచ్చుకొక కథ :-

విశాల పురంలో భద్రశృంగుడనే రాజు యొక్క పుత్రుడు కీర్తిమాలి. అతడొకనాటి రాత్రి మారువేషంతో సంచరిస్తూ జమ్మి చెట్టు దగ్గర యోగంలో ఉన్న ఒక బాపనయ్యను చూచాడు. రాజు ఆ బ్రాహ్మణున్ని వివరాలనడిగినా మాటాడనందువల్ల బలంగా ఈడ్చాడు. అతని ప్రభావం వల్ల రాజు రాయిలాగా నిశ్చేష్టుడయ్యాడు. తన తప్పును మన్నించుమని ప్రార్థించాడు. అప్పుడా బ్రాహ్మణుడు-

**"సాలగ్రామ ఇతిఖ్యాతం విష్ణుస్థానముత్తమమ్ ।**
**నిత్యం సన్నిహిత స్తత్ర చక్రరూపేజగత్పతిః ।**
**తత్ర చక్రాం కితం సర్వం స్థావరం జంగమం తథా!!"**

సాలగ్రామమనే చోట చక్ర రూపి అయిన విష్ణువు సదాసన్నిహితుడై యుంటాడు. అక్కడ ఉన్న స్థిర, చర వస్తువులన్నీ చక్రాంకితాలై శోభిస్తుంటాయి. అక్కడికి వెళ్ళితే కర్మలన్నీ నశిస్తాయి. కాబట్టితాను ఆస్థలానికే పోతున్నాను - అని వివరించాడు.

కీర్తిమాలి ఆ విప్రుణ్ని తన పట్టణానికి తీసుకొని పోయాడు. ఆ బ్రాహ్మణుని వల్ల రాజు సుదర్శన మంత్రోపదేశాన్ని పొంది, ఆ మంత్రదేవతను

ఉపాసించాడు–ధ్యానించాడు. దాని ప్రభావం వల్ల సుదర్శన మహాయంత్ర ఘటితమైన వితానం కలిగియున్న విమానాన్ని పొందాడు. దాని సహాయంతో ఇంద్రుణ్ణి కూడా జయించాడు. దేవరాజు ప్రయోగించిన బాణాలూ, వజ్రాయుధమూ సుదర్శన చక్రం యొక్క శక్తిలో లయ మయ్యాయి. ఇంతవరకు తనకు విధేయుడైన కీర్తిమాలి ఇప్పుడు తనను జయించడానికి కారణమేమి? అని ఇంద్రుడు అడిగాడు. సుదర్శన మహాయంత్ర ఘటితమైన వితానం యొక్క ప్రభావమే కారణమని కీర్తిమాలి విశదీకరించాడు.

7. జయ జయ శ్రీసుదర్శన 8. జయ జయశ్రీసుదర్శన

III. **స్ఫుట తటి జ్జాల పింజర, పృథు తరజ్వాల పంజర**
**పరిగతప్రత్న విగ్రహ, పటుతర ప్రజ్ఞదుర్గ్రహ।**
**ప్రహరణ గ్రామమండిత, పరిజనత్రాణ పండిత**
**జయ జయ శ్రీసుదర్శన, జయ జయ శ్రీ సుదర్శన ॥**

**అర్థం** :– స్ఫుటతటిత్ జాల పింజర । స్ఫుట=ప్రకాశించే; తటిత్+జాల= మెరపుల సమూహంవలె; పింజర=బంగారువన్నెకల వాడా। పృథు తరజ్వాల పంజర! పృథుతర=చాలా పెద్దవైన; జ్వాల పంజర=జ్వాలలు అనే పంజరం కలవాడా! పరిగత ప్రత్న విగ్రహ! పరిగత=గ్రహింపబడిన; ప్రత్న=పురాతనమైన, విగ్రహ=విగ్రహంకలవాడా! పటుతరప్రజ్ఞదుర్గ్రహ! పటుతర =చాలాధృఢమైన; ప్రజ్ఞ=బుద్ధికలవారి చేతనూ; దుర్గ్రహ=తెలియశక్యం కానివాడా! ప్రహరణ గ్రామ మండిత! ప్రహరణ=ఆయుధాల; గ్రామ=సమూహంచేత; మండిత=అలంకరింపబడిన వాడా। పరిజన త్రాణ పండిత! పరిజన=ఆశ్రితులను; త్రాణ=రక్షించడమందు; పండిత=సామర్థ్యం కలవాడా! శ్రీ సుదర్శన! జయ జయ! శ్రీ సుదర్శన! జయ, జయ.

**తా॥** మెరుపుల లాగా ప్రకాశించే బంగారు వన్నె కలవాడా! పెద్ద పెద్ద మంటలు పంజరంగా కలవాడా! స్వేచ్ఛచేత దాల్చిన పురాతన దేహం కలవాడా! పరిణత ప్రజ్ఞ కలవారి చేత కూడా గ్రహింప సాధ్యం కానివాడా! దివ్యాయుధాల చేత అలంకరింపబడినవాడా! భక్త జనులను కాపాడడంలో నైపుణ్యం కలవాడా! ఓ శ్రీ సుదర్శనుడా! జయ, జయ.

**వ్యాఖ్య :-** స్ఫుట తటిజ్జాల పింజరుడు :- మెరుపుక్షణ కాలమే ఉంటుంది. అయినా దుర్నిరీక్ష్యమైనది. సుదర్శనుని శరీరకాంతి మెరుపులాగా పోయేది కాదు. ఎల్లప్పుడు, ఎడతెగకుండా మెరిసే మెరుపుల వలె పింగళ వర్ణంతో ప్రకాశిస్తుంటాడు సుదర్శనుడు. 2. పంజరం అంటే మృగ పక్ష్యాదులను బంధించే పరికరం. పంజరం మధ్యన ప్రాణి ఉన్నట్లే పెద్ద పెద్ద అగ్నికీలాలు (మంటలు) తన చుట్టూ చెలరేగుతుంటే తాను వాటి నడుమ భాసిస్తుంటాడు. 3.భగవానుడు ఎలాగా సనాతనుడో, అలాగా, సుదర్శనుని రూపంకూడా పురాతనమైనది. సంసారులలాగా కర్మ మూలకమైనవి కాక, కృపామూలకాలైనవే సుదర్శనావతారాలు.

**"తేజసః శమనంచాస్య విశ్వకర్మాచకారహ।**
**భ్రమమారోప్య సూర్యంతు తస్యతేజో నిశాతనమ్॥**
**హృతవానష్టమంభాగం సవ్యశాత యదవ్యయమ్।**
**యత్తస్మాత్ వైష్ణవం తేజః శాంతితం విశ్వకర్మణా॥**
**జాజ్వల్య మానమపతత్ తద్భూమౌ మునిసత్తమ।**
**త్వష్టైవ తేజసాతేన విష్ణోశ్చక్రమ కల్పయత్॥**

సూర్యతేజస్సు అతని భార్యయైన ఛాయాదేవికి దుర్భరంకాగా, విశ్వకర్మ సూర్య బింబాన్ని యంత్రంచేత సానబట్టాడు. నేలరాలిన తేజః కణాలతో సుదర్శన చక్రాన్ని నిర్మించి శ్రీ మహావిష్ణువుకు సమర్పించాడని సుదర్శనా

విర్భావ వృత్తాంతాన్ని తెలిపింది శ్రీ విష్ణుపురాణం.

పాద్మోత్తరఖండలో,

**"అథ విష్ణుముఖాదేవాః స్వతేజాంసి దధుస్తదా।**
**తాన్యైక్యం వైగతానీశో దృష్ట్వాస్వంచాముచన్మహః॥**
**తేనాకరో న్మహాదేవః సహసాశస్త్ర ముత్తమమ్।**
**చక్రం సుదర్శనం నామ జ్వాలా మాలాతి భీషణమ్॥"**

పరమేశ్వరుడు దేవతలందరి తేజస్సులతో తన తేజస్సునూ కలిపి, ఆ తేజఃపుంజంతో అతి భీషణ జ్వాలలుకల సుదర్శన చక్రాన్ని నిర్మించి విష్ణువుకు సమర్పించాడు అని తెలుస్తున్నది.

పరమ పదనాథుని సన్నిధిలో ఉండే నిత్యసూరులందరూ "విపన్యవోజాగృవాంసః సమింధతే" శ్రుతి పలికినట్లు భగవంతుణ్ని నిరంతరం స్తుతిస్తూ, దివ్యంగా ప్రకాశిస్తుంటారట. వారి కన్న మిన్నగా ప్రకాశిస్తూ భగవానునికి ఆనందాన్ని కలిగించే వాడు సుదర్శనుడు. భగవత్సేవ కోసం స్వేచ్ఛతో అనేక రూపాలను ధరిస్తాడు. **"అలైకడల్ పళ్ళి యమ్మానై ఆషిప్పిరాన్ తన్నై"** పాలకడలిలో శేషతల్పమందు పవ్వళించి యోగనిద్రలో ఉన్నప్పుడు జగద్రక్షణ చింతను చేసే రూపం సుదర్శనునిదే.

రాజు రహస్యంగా తన రాజ్యంలో సంచరిస్తుంటే గూఢచారులు మారురూపంతో ఉండి, అక్కఱ పడినప్పుడు రాజుకు సహకరిస్తారు కదా! అట్లే పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారాలలోనూ స్వామిని విడువక సేవిస్తుంటాయి. అవతారాలలో అదృశ్యంగా వెంట ఉండి అవసరపడినప్పుడు స్వామికి ఉపకరించే అంతరంగిక సేవకుడు సుదర్శనుడని ఉభయ వేదాంతశాస్త్రాల వల్ల బోధపడుతుంది.

కూర నారాయణులు రచించిన సుదర్శన శతకంలోనూ 'విష్ణుసంకల్ప వృక్షః'- కల్పతరువుగానూ, పడగలరీతిగానూ, గొడుగుగానూ సుదర్శనం నిరూపింపబడిన విషయం గమనీయం.

**4. పటుతరప్రజ్ఞ దుర్గ్రహుడు :-** అతి సూక్ష్మ బుద్ధి కలవారికినీ సుదర్శనుని తత్త్వం తెలియరానిది. పరమభక్తులకు కొంత తెలుస్తుంది. భక్తిహీనులెంత ధిషణులైనా వారికి ఏమాత్రం తెలుసుకొనడానికి సాధ్యం కాదు. "కర్తుం యత్ తత్త్వబోధేన నిశితమతిభిర్నారదా ద్యైస్తు శక్తః'' (సు.శ.) "పత్తుడైయడియవర్క్కెళియవన్, పిఱర్గళ్క్కరియ విత్తకన్" (తి.వా.మొఝి) భక్తులకు సులభుడు, ఇతరులకు తెలియ శక్యంకాని వాడు, అని భగవంతునికి చెప్పబడిన సూక్తి సుదర్శనునికి కూడా అనుసంధింప తగినదే.

**5. ప్రహరణ గ్రామమండితుడు :-** సుదర్శనుడు అష్టదళ పద్మంలో షట్కోణ యంత్రంలో ఎనిమిది భుజాలలో శంఖం, చక్రం, ధనుస్సు, ముసలం, పాశం, అంకుశం, గద, కమలం అనే ఎనిమిది ఆయుధాలను ధరించి శోభిస్తుంటాడు. "సుదర్శనాష్టకం" అష్టభుజుడైన సుదర్శనుని స్తోత్రంగా రచించారు దేశికులు. తర్వాత శ్రీ షోడశాయుధ స్తోత్రమునూ వారే రచించారు. విశ్వంలో ఎన్ని ఆయుధాలున్నవో వాటినన్నింటిని తనకు భూషణాలుగా మలచుకొన్నాడు. కాబట్టి సుదర్శనుని గూర్చి "హేతి రాజాయ నమః" - అంటారు భక్తులు "జుష్టః షోడశభిర్దివ్యైరాయుధైరాయుధేశ్వరః" (షోడశాయుధస్తోత్రం).

**6. పరిజన త్రాణ పండితుడు :-** భగవద్భక్తులనూ, తననాశ్రయించిన వారినీ రక్షించడానికి స్వశక్తితో విజృంభిస్తాడు సుదర్శనుడు. తనను ఉపాసించిన వారికి అభీష్టసిద్ధినీ కలుగజేస్తాడు. ఆశ్రిత విరోధులను నిర్దయతో సంహరించడానికి వెనుదీయడు. అగస్త్య మహర్షి శాపం వల్ల 'ఇంద్రద్యుమ్నుడు'

గజేంద్రుడయ్యాడు. శాపగ్రస్తుడైన 'హూహూ' అనే గంధర్వుడు మొసలియై సరస్సులో నివసించాడు. గజేంద్రునికి పూర్వం వలె విష్ణుభక్తి మారలేదు. తామర కమలాలతో పూజించే గజేంద్రుడు ఎప్పటి వలెనే పుష్పార్చన కోసం పూవులను కోయడానికి సరస్సులోకి దిగాడు. మొసలి ఆ ఏనుగు కాలును పట్టుకొన్నది.

"గజ ఆకర్షతే తీరే గ్రాహ ఆకర్షతేజలే"– ఏనుగు తీరానికి లాగసాగింది. మొసలి నీటిలోనికి లాగ సాగింది. పెక్కేండ్లు పరస్పరం పోరాడారు. చివరకు గజేంద్రుడు అలసిపోయి శ్రీమన్నారాయణుడనే మూలమూర్తిని మహా విశ్వాసంతో ప్రార్థించాడు.

"మషుంగాద వైనుతియ శక్కర నల్వలతైయాయ్, తొషుంగా దల్ కళిఅళిప్పాన్ పుళ్ళూర్న్దుతో న్ఱినైయే"– అన్నారు నమ్మాళ్వార్లు. శరణాగతుడైన గజేంద్రుని సంరక్షణార్థం మొక్కవోని పదును గల చక్రాయుధాన్ని కుడిచేత ధరించి గరుడారూఢుడై వచ్చి సరస్తీరాన ప్రత్యక్షమయ్యాడన్నారు. గజేంద్రుడు అలాంటి స్వామి అందాన్ని సేవించి భగవత్పాదాలయందు కమలాలను అర్పించి, కైంకర్యం చేయాలనే ఆశ కలవాడు. సంకల్పం కూడా మొక్కవోనిదే కదా! భగవానుడు వైకుంఠంలోనే ఉండి తన సంకల్పశక్తిని వినియోగించి మొసలి నోట చిక్కిన గజేంద్రుని పాదాన్ని విడిపించవచ్చుకదా! శరీరం క్షణ భంగురమని తెలిసిన గజేంద్రుడు తనను కాపాడుకోవడానికి ఉబలాట పడలేదు. కాబట్టి భగవానుడే వచ్చి కనబడకపోతే తన తేజస్సుకే గొప్ప లోపం కదా! ఆర్తనాదాన్ని విని భక్తుణ్ని వెదకుకొంటూ రావడమే "తస్యనామ మహద్యశః" (శ్రుతి) అన్నట్లు భగవంతుని ప్రఖ్యాతి. అందుకే భక్తుని మొర వినగానే అకస్మాత్తుగా లేచి పరుగుదీశాడు. ఇంగితజ్ఞుడైన గరుడు దెదుట నిల్చినందున అధిరోహించాడు. గరుడుని వేగం సరిగా లేదని తానే గరుడుణ్ని తన పాదాల

మధ్య ఇరికించుకొని త్వరగా వచ్చి ప్రత్యక్షమయ్యాడట. ఇంతదాకా సుదర్శన చక్రం తన చేతిలో ఉన్నదన్న విషయమే స్వామికి తెలియదట. భక్తుని కోరికను కనిపెట్టిన సుదర్శనం స్వామి హస్తం నుంచి. విడివడి

**స్థలస్థందారయామాస గ్రాహంచక్రేణ మాధవః।**

**మోక్షయా మాస నాగేంద్రం పాశేభ్యః శరణాగతమ్॥" (విష్ణుధర్మం)**

అన్నట్లు మొసలిని వధించింది, గజేంద్రుణ్ని సంరక్షించింది" గరుడ వాహనుడు మకరపు పట్టుకు గాయమైన గజేంద్రుని పాదానికి తన అంగవస్త్రాన్ని నోట బెట్టుకొని ఊది వెచ్చగా అద్ది చికిత్స చేశాడని నంబిళ్ళైగారి (భగవద్విషయం-ఈడు) రస్యమైన సూక్తి. పరిచారకులు చేసిన గొప్ప పనులన్నీ ప్రభువుకే ప్రఖ్యాతి కలిగిస్తాయికదా! అందుకే 'మాధవః' అని 'విష్ణు ధర్మం' సుశ్లోకించింది. భగవత్సాహచర్యంతో ఆశ్రిత రక్షణ మందు అనితర సాధారణ ప్రజ్ఞకలవాడు సుదర్శన భగవానుడు. జయ జయ శ్రీ సుదర్శన 8.జయ జయ.

IV. **నిజ పద ప్రీత సద్గణ, నిరుపధిస్ఫీతషడ్గుణ**
**నిగమని ర్వ్యూఢవైభవ, నిజపరవ్యూహవైభవ।**
**హరిహయ ద్వేషిదారణ, హరపురప్లోషకారణ**
**జయ జయ శ్రీ సుదర్శన, జయ జయ శ్రీ సుదర్శన ॥**

**అర్థం :-** నిజపద ప్రీత సద్గణ! నిజ=తనయొక్క; పద=స్థానం యొక్క ; ప్రీత=ప్రాప్తిచే సంతోషపడిన; సత్+గణ=సత్పురుష సమూహం కలవాడా! నిరుపధిస్ఫీతషడ్గుణ! నిరుపధి=సహజమైన; స్ఫీత=వృద్ధిని పొందిన; షట్+గుణ=ఆఱుగుణాలు కలవాడా! నిగమనిర్వ్యూఢవైభవ! నిగమ=వేదాలచే; నిర్వ్యూఢ=నిర్మహింపబడిన; వైభవ=మహిమగలవాడా! నిజ పరవ్యూహ వైభవ! నిజ=ఆత్మీయాలైన పరం, వ్యూహం, మొదలైన రూపాల మహిమ గలవాడా!

హరి హయద్వేషి దారణ! హరిహయ=ఇంద్రుని యొక్క; ద్వేషి=శత్రువులను; దారణ=చీల్చి వేసేవాడా! హరపుర=వారాణసీ (కాశీ) నగరం యొక్క; ప్లోష=దహనానికి; కారణ=హేతు భూతుడా! శ్రీ సుదర్శన జయ జయ! శ్రీ సుదర్శన జయ జయ.

**తా ॥** నిజ స్థానాన్ని పొంది సంతసించిన సత్పురుషులు కలవాడా! జ్ఞానాది షడ్గుణాలు కలవాడా! వేదాల యందు స్తుతింపబడిన మహిమ కలవాడా! ఆత్మీయాలైన పరవ్యూహాది రూప వైభవం కలవాడా! ఇంద్రుని శత్రువులను సంహరించేవాడా! కాశీనగర దాహానికి కారణమైన వాడా! శ్రీ సుదర్శన! జయ జయ.

**వాఖ్య :–** ఆశ్రిత విరోధి నిరసనాది వైభవం వర్ణితం.

**1. నిజ పదప్రీతసద్గణుడు :–** తన పదం యొక్క లాభం చేత సత్తను పొందిన మహనీయుల నెందరినో కలవాడు. 'పద' శబ్దానికి చిహ్నమని అర్థం. "పదంవ్యవసితత్రాణ స్థానలక్ష్మాంఘ్రివస్తుషు" (అమరం) సుదర్శన చిహ్నాన్ని పొంది తత్త్వజ్ఞానం కలవారై సంతోషించిన ఆళ్వార్లూ, ఆచార్యపురుషులూ, మొదలైన ప్రపన్న జనసమూహం కలవాడు. ప్రపన్నుని స్వరూపానికి చక్రాంకనమే నిరూపకం కదా!

**"చక్రాంకితాఃప్రవేష్టవ్యాః యావదాగమనంమమ।**
**నా ముద్రితాః ప్రవేష్టవ్యాః యావదాగమనంమమ॥**

శ్రీ కృష్ణ భగవానుడు యుద్ధానికి వెళ్ళుతూ తాను తిరిగి వచ్చే వరకు చక్రాంకితులు కాని వారిని ద్వారకలోనికి ప్రవేశింపనీయరాదని ఆజ్ఞాపించాడు.

2. నిరుపధిస్ఫీత షడ్గుణుడు :– "తవానంత గుణస్యాపి షడేవప్రథమే గుణాః ", అనంత కల్యాణ గుణాలను కలిగియున్న భగవానునికి జ్ఞానం, శక్తి, బలం,

ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అను ఆఱుగుణాలే ముఖ్యమైనవి. ఈ షాడ్గుణ్యం పరవాసుదేవునికి సంబంధించినదే అయినా, భగవద్వ్యూహరూపియై తేజో ౨_భిమానియైన సుదర్శనునికి ఏకారణం లేకుండా సంక్రమించి వృద్ధిని పొందుతుంది. "ఎప్పోదుమ్ కైకషలానేమియాన్", స్వామి పరవ్యూహాది పంచావతారాలలోనూ తనచేతియందే చక్రాన్ని ధరిస్తాడు.

**3.నిగమని నిర్వ్యూఢ వైభవుడు :-** వేదాలు కీర్తించిన మహిమ కలవాడు. **"పవిత్రమిత్యగ్నిః, అగ్నిర్వైసహస్రారః, సహస్రారోనేమిః, నే మినాతప్తతనూః, బ్రహ్మణః సాయుజ్యం లోకతామాప్నోతి॥"** (సామవేదం).

పవిత్రమైన సహస్రార చక్రాగ్నిచే తప్తమైన శరీరంకల వ్యక్తి పరబ్రహ్మ యొక్క సాయుజ్యాన్ని పొందుతాడు.

**"ఏభిర్వయమురుక్రమస్య చిహ్నైరంకితా లోకే సుభగా భవేమ।**
**తద్విష్ణోః పరమం పదం గచ్ఛంతి హిలాంఛితాః ॥**

**(అధర్వణవేదం)**

త్రివిక్రముని చిహ్నాలైన శంఖ చక్రాలచే ముద్రితులైన మనం పాపరాశిని విదళించుకొని, సుఖంగా ఉంటాము. చక్రాంకితులైన వారు విష్ణుస్థానమైన పరమ పదాన్ని అవశ్యంగా పొందుతారు.

ఇలాగా నాలుగు వేదాలయందు సుదర్శన చక్రవైభవం ప్రశంసింపబడింది.

**4. నిజ పరవ్యూహ వైభవుడు :-** "నిజ మాత్మీయనిత్యయోః" (విశ్వనిఘంటువు) నిజశబ్దానికి 'తనకు సంబంధించినది, నిత్యమైనది' అనే అర్థద్వయముంది. పరవ్యూహ విభవాంతర్యామ్యర్చా రూపాలు నిత్యములే! పాంచరాత్రం'లో శ్రీ సుదర్శనం యొక్క వ్యూహరూపాలు ప్రతిపాదింప బడినవి. ఆ నిత్యరూపాలతో

ఆత్మీయ వ్యూహరూప వైభవం కలవాడు సుదర్శనుడు.

"మఘంగాద వైనుదియ శక్కరనల్వలత్తైయాయ్"- పరరూపంలో వాసుదేవుడు మొక్కవోని పదును (తేజస్సు) గల చక్రాన్ని కుడిచేత ధరించి యుంటాడు అనే సూక్తి పరరూప వైభవాన్ని తెల్పుతుంది.

"అముదమమరర్గట్కీన్ద నిమిర్ శుడరాషి" దేవతలకు అమృతాన్ని ఇచ్చిన స్వామి పరమోజ్జ్వలమైన చక్రాయుధం కలిగినవాడు' అనే సూక్తి వ్యూహరూపవైభవాన్ని ప్రకటిస్తుంది. "కైయార్ శక్కరత్తు" - శ్రీకృష్ణ భగవానుడు చేతిలో చక్రాయుధాన్ని ధరించియున్న సొంపు పెంపును కీర్తించిన సూక్తి విభవరూప వైభవాన్ని ప్రశంసిస్తుంది. "అషియెష" అనే సూక్తి అంతర్యామి విషయంలోనూ, "వెళ్ళైచ్చురి శఙ్గొడాషియేన్ది" ఇత్యాది సూక్తులు అర్చారూప విషయంలోనూ కీర్తించదగినవే కదా!

**5. హరిహయ ద్వేషిదారణుడు :-** ఇంద్ర శత్రువులైన దానవులను దారుణంగా చంపేవాడు సుదర్శనుడనే విషయం పురాణాలలో ప్రస్ఫుటమే.

**6. హర పుర ప్లోష కారణుడు :-** తానే నిజమైన వాసుదేవుడనని శ్రీకృష్ణుణ్ని ద్వేషించిన పౌండ్రక వాసుదేవుణ్ని స్వామియే చక్రంతో సంహరించాడు. అతని స్నేహితుడైన కాశీరాజు ఎదిరించినప్పుడు శ్రీకృష్ణుడు బాణాలతో అతని దేహాన్ని చెండాడి కాశీనగరంలో పడవేశాడు. తండ్రి వధకు దుఃఖించిన కాశీరాజు పుత్రుడు పరమశివుణ్ని ఆరాధించి, 'కృత్య' అనే ఘోరశక్తిని పొంది, దాన్ని శ్రీకృష్ణుని మీదికి ప్రయోగించాడు. ఆ శక్తి ద్వారకా నగర వాసులను బాధిస్తుంటే, శ్రీకృష్ణుడు గమనించి చక్రాయుధాన్ని ప్రయోగించాడు. సుదర్శన చక్రం 'కృత్య'తో పాటు కాశీనగరాన్నీ దహించి వేసెనన్న వృత్తాంతం భాగవత, విష్ణు పురాణాలలో వర్ణితం.

**"నిన్యే వన్యేవ కాశీ దవ శిఖిజటిల జ్యోతిషాయేన దాహం**
**కృత్యావృత్యా విలిల్యే శలభసులభయా యత్ర చిత్ర ప్రభావే॥"**

(సుదర్శన శతకం) "వారాణసీ హరపురీభవతా విదగ్ధా" (అతిమానుషస్తవం)

7. శ్రీ సుదర్శన! జయజయ! 8.శ్రీసుదర్శన! జయజయ!

V. **దనుజవిస్తార కర్తన; జని తమిస్రా వికర్తన**
**జగద విద్యానికర్తన, భజద విద్యానివర్తన ।**
**అమర దృష్ట స్వవిక్రమ, సమరజుష్ట భ్రమిక్రమ**
**జయ జయ శ్రీ సుదర్శన, జయ జయ శ్రీ సుదర్శన ॥**

**అర్థం :-** దనుజ విస్తార కర్తన। దనుజ=రాక్షసుల యొక్క; విస్తార=విస్తృతిని; కర్తన=ఖండించే వాడా! జనితమిస్రావికర్తన! జని=సంసారమనే; తమిస్రా=చీకటి రాత్రికి; వికర్తన=సూర్యుని వంటి వాడా! జగద విద్యాని కర్తన! జగత్=లోకమందలి; అవిద్యా=అజ్ఞానాన్ని; నికర్తన=నశింపజేసేవాడా! భజ దవిద్యానివర్తన! భజత్=భక్తుల యొక్క; అవిద్యా=అజ్ఞానాన్ని; నివర్తన=పూర్తిగా పోగొట్టేవాడా! అమర దృష్ట స్వ విక్రమ! అమర=దేవతల చేత; దృష్ట=చూడబడిన; స్వ విక్రమ=నిజ విక్రమం కలవాడా! సమరజుష్ట భ్రమిక్రమ! సమర=యుద్ధమందు; జుష్ట=ఆశ్రయింపబడిన; భ్రమిక్రమ=భ్రమించే వరుస (విధం) కలవాడా! శ్రీ సుదర్శన! జయ, జయ! శ్రీ సుదర్శన! జయ జయ!

**తా॥** దానవుల విస్తృతిని-వ్యాప్తిని నశింపజేసేవాడా। సంసారమనే చీకటి రాత్రికి సూర్యుని లాంటివాడా! లోకమందలి అవిద్యను పోగొట్టేవాడా! భక్తుల అజ్ఞానాన్ని నిశ్శేషంగా నశింప జేసేవాడా! దేవతలచే చూడబడిన నిజపరాక్రమం కలవాడా! యుద్ధాలలో భ్రమణ వైచిత్రికల వాడా! శ్రీ సుదర్శన! జయ, జయ! శ్రీ సుదర్శన! జయ, జయ!!

**వ్యాఖ్య :–** సాంసారిక దుఃఖ నివృత్తి వర్ణితం.

**1. దనుజ విస్తార కర్తనుడు :–** పరమ క్రూరులై ప్రబలులైన అసురుల కులాలనన్నిటినీ వక్కలు, ముక్కలుచేసి, వెంటనే బుగ్గిచేసి, నామ రూపాలు లేకుండా చేసిన, క్రోధాగ్ని జ్వాలలచే ప్రజ్వలించే వాడు శ్రీ సుదర్శనుడు – **"కూఱాయ్ నీఱాయ్, నిలనాకిక్కొడు వల్లశురర్ కులమొల్లామ్ శీఱా వెరియుమ్ తిరునేమి"**– (తి.వా.మొ. 6-10-2) అన్నారు నమ్మాళ్వార్లు.

**2.**జని **తమిస్రా వికర్తనుడు :–** సూర్యుడు చీకటి రాత్రిని చీల్చేస్తాడు. అజ్ఞానమనే అంధకారంలో కొట్టు మిట్టాడుతూ మూర్ఛపోయినట్లున్నది సంసారం. ఈ సంసారమనే చీకటి రాత్రిని భంజించడానికి సూర్యునికెలా సాధ్యమవుతుంది? సహస్రాదిత్య సంకాశుడైన శ్రీ సుదర్శన భగవానుడే జని రజనీ భంజనం చేయడానికి సమర్థుడు. 'వికర్తన' శబ్దం 'విశ్వకర్మచేత వికృతు'డన్న వ్యుత్పత్తి చేత సుదర్శనుడావిర్భవించిన గాధను తెలుపుతుంది.

**3. జగదవిద్యానికర్తనుడు :–** లోకాల తమస్సును నశింపజేసేవాడు.

**4. భజదవిద్యానివర్తనుడు :–** ఆశ్రితుల అవిద్యను పోగొట్టేవాడు. భగవంతుణ్ని సర్వదా సేవించే ("సదా పశ్యంతి సూరయః") వారికి క్షణకాలం (ఎడం) విచ్ఛేదం అయితే మనస్సు కలతపడుతుంది. కాబట్టి అట్టి తమస్సు కలుగకుండా చేస్తాడు. నిత్యసూరులను అవిద్య నుంచి కాపాడడమేమి? విచిత్రంగా ఉందే! అనవచ్చు. అవిద్య లేకపోవడం రెండు విధాలు : 1.ప్రాగభావం 2. ప్రధ్వంసాభావం. నిత్య సూరులను ప్రాగభావం (అవిద్య మొదలే లేకపోవడం) చేత కాపాడుతాడు. లోకంలో భక్తులను (అవిద్యను ధ్వంసించడం) ప్రధ్వం సాభావం చేత కాపాడుతాడు. ఉభయ విభూతులలోను సుదర్శనుడు శ్రియః పతి యొక్క సౌందర్యాన్ని భక్తులకు చూపిస్తూ, వారి హృదయాలను ఆకర్షిస్తూ, భగవదభిముఖంగా చేయడంలో అగ్రగణ్యుడు. (శాస్త్రార్థమిది. సుఖబోధకెదుగాలి మనం)

అనంత కల్యాణ గుణాకరుడైన సర్వేశ్వరుడెక్కడ? నికృష్ణుడనైన నేనెక్కడ? అని నైచ్యాను సంధానం చేత దూరమైన భక్తులకు గోవిందుడు తన అవయవ సౌష్ఠవ శోభను చూపి వారిని జయిస్తాడు. ఆశ్రిత విరోధులకు తన పరాక్రమాన్ని చూపి వారినీ జయించే శీలం కలవాడని "కూడారైవెల్లుమ్ శీర్" (తిరుప్పావై) అన్నచోట ఆచార్యులు వివరిస్తుంటారు కదా!

**5. అమర దృష్ట స్వవిక్రముడు :-** దివ్యలోక వాసులు సుదర్శనుని విక్రమాన్ని చూస్తుంటారు.

**6. సమరజుష్ట భ్రమిక్రముడు :-** రణరంగంలో చక్రం గిర గిర తిరుగుతూ విజృంభిస్తుంది. ఉజ్జ్వలజ్వాలలను వమనంచేస్తూ అవక్రవిక్రమంతో భ్రమించే క్రమం వర్ణనాతీతం. అది దేవతలకు వినోదం.

**"నాథవీక్షా శీధుక్షీబోద్వేల నృత్తాభిరామమ్"** (శ్రీరంగరాజస్తవం)

శ్రీరంగనాథుడు ఆశ్రిత విరోధులను వధించుమనీ ఆజ్ఞను సూచించే చూపును సుదర్శనుని పైన ప్రసరిస్తాడట. ఆ చూపు సుదర్శనునికి మధువు లాగా పారవశ్యాన్ని కలిగించడం వల్ల, తాను సమరాంగణంలో తల-మొల తెలియనట్లు చేసే భ్రమణక్రమం, చిత్తాన్ని ఉత్తలం చేసే నృత్త (నాట్య) మాడినట్లుంటుందట.

**"ప్రాప్తేవ క్షీబభావం ప్రతిదిశమసకృత్ తన్వతీఘూర్ణితాని"** (సు.శ.16) ఇట్టి వైభవం కలిగిన 7.శ్రీ సుదర్శన! జయ జయ! 8.శ్రీ సుదర్శన! జయ జయ!

VI **ప్రతిముఖాలీఢబంధుర, పృథుమహాహేతిదంతుర**
**వికటమాయా బహిష్కృత, వివిధమాలా పరిష్కృత।**

**పృథుమహాయంత్ర తంత్రిత, దృఢదయా తంత్రయంత్రిత**
**జయ జయ శ్రీ సుదర్శన, జయ జయ శ్రీ సుదర్శన ॥**

**అర్థం :-** ప్రతిముఖాలీఢ బంధుర! ప్రతిముఖ=శత్రువుకెదురుగా ఉన్నట్లు; ఆలీఢ=చాచి నిలబడిన ఉనికి చేత; బంధుర=మనోజ్ఞ మైనవాడా! పృథుమహాహేతి దంతుర! పృథు=విపులమైన; మహా=గొప్పవైన; హేతి=ఆయుధాలచేత; దంతుర=వ్యాప్తమైన వాడా! వికట మాయా బహిష్కృత, వికట=వికటమైన; మాయా=మాయచేత బహిష్కృత=దూరం చేయబడిన వాడా! వివిధమాలా పరిష్కృత! వివిధమాలా=అనేక విధాలైన మాలికల చేత; పరిష్కృత=అలంకరింపబడిన వాడా! పృథుమహాయంత్ర తంత్రిత! పృథు=గొప్పదైన; మహాయంత్ర= పూజ్యమైన యంత్ర మందు; తంత్రిత=ప్రతిష్ఠింపబడిన వాడా! దృఢ దయాతంత్ర యంత్రిత! దృఢ=స్థిరమైన; దయా తంత్ర=దయ అనే తంత్రం చేత; యంత్రిత=వశం చేసుకొనబడినవాడా! శ్రీసుదర్శన! జయ జయ!

**తా॥** ప్రత్యాలీఢ మనే సన్నివేశంచే అందమైన రూపం కలవాడా! విపులమైన గొప్ప ఆయుధాలచే వ్యాప్తమైనవాడా! వికటమైన మాయకు దూరమైనవాడా! వివిధ మాలలచేత అలంకరింపబడిన వాడా! గొప్ప యంత్రమందు ప్రతిష్ఠింపబడిన వాడా! దయ అనే తంత్రం చేత వశీకరింప చేసుకోబడినవాడా! శ్రీ సుదర్శన! జయ జయ! శ్రీ సుదర్శన! జయ॥

**వ్యాఖ్య :-** నిరతిశయ కరుణా కరత్వం వర్ణితం.

**1. ప్రతిముఖాలీఢ బంధురుడు :-** 'ఆలీఢం' అంటే కుడికాలును ముందుకు చాచి, ఎడమ కాలును కొంచెం ముందుకు మడిచి నిల్చియుండడం ! ప్రత్యాలీఢం' అంటే ఎడమకాలను ముందుకుచాచి, కుడికాలును వెనుకకు

పెట్టికొద్దిగా వంచినిలబడడం. 'బంధుర' శబ్దానికి కొంచెం వంగియున్నది అనే అర్థం. ప్రత్యాలీఢపాదుడుగా ఉండడం శత్రువు నెదిరించే వీరపురుషుని సన్నివేశం... **"ఆలీఢంతు తతో ఉగ్రతః, దక్షిణే వామమా కుంచ్య ప్రత్యాలీఢం విపర్యయే॥"** ఆలీఢ మనే సన్నివేశానికి విపర్యయంగా ఉండే రూపం పత్యాలీఢం. ప్రత్యాలీఢ సన్నివేశంచే రమ్యమైనవాడు. **"బంధూర బంధురౌ రమ్యే నమ్రే హంసేచ బంధుర"** ఇతి రభసః

**2. పృథుమహాహేతిదంతురుడు :-** 'దంతురు' దంటే బయటకు పొడుచుకొని వచ్చిన దంతాలుకలవాడని అర్థం. ఎనిమిది లేదా పదహారు రకాల ఆయుధాలు బయటకు పొడుచుకొని వచ్చినట్లు ధరించినవాడు. "జుష్టః షోడశభిర్దివ్యైరాయుధైరాయుధేశ్వరః" (షోడశాయుధస్తోత్రం)

**3. వికటమాయా బహిష్కృతుడు :-** వికటమైన మాయ అంటే అజ్ఞానం, అన్యధా జ్ఞానం, విపరీత జ్ఞానం, అది లేనివాడు. లేదా "మాయాస్యాత్ శాంబరీ బుద్ధ్యోః" (మేదిని) నిఘంటువును బట్టి, రాక్షసుల మాయలను దూరంగా పారద్రోలేవాడని అర్థం.

**4. వివిధమాలా పరిష్కృతుడు :-** పలుమాలలచేత అలంకరింపబడిన వాడు.

ప్రకృతి, మహదాది చతుర్వింశతి తత్త్వాలతో కూడిన జగత్తును మాలగా అలంకరించుకొన్న వాడనీ చెప్పవచ్చు.

**5. పృథుమహాయంత్ర తంత్రితుడు :-** గట్టిగా ఉండే బంగారు, వెండి, రాగి రేకుల మీద స్థిరంగా ఉండేవిధంగా చెక్కబడిన ఆఱు కోణాలుగల యంత్రమందు స్థాపింపబడిన వాడు సుదర్శనుడు. ఉపాసకులు భక్తితో షట్కోణ యంత్రమందు ప్రతిష్ఠిస్తే, కృపా పరవశుడై అధిష్ఠించి ఉంటాడు. యంత్రం పూజనీయం.

**6. దృఢదయా తంత్ర యంత్రితుడు :-** దయ, భక్తి కంటె గొప్పది. "కృపైయుడైయ తిరువాషి" (నంబిళ్ళైసూక్తి) కృపాతంత్రం చేత సతత భ్రమణాత్మకమైన సంసార చక్రాన్ని వశమందు ఉంచుకొన్న వాడు సుదర్శన భగవానుడు.

7. శ్రీ సుదర్శన! జయ, జయ ! 8.శ్రీ సుదర్శన! జయ ! జయ!

VII. **మహిత సంపత్సదక్షర, విహిత సంపత్ షడక్షర**
**షడర చక్ర ప్రతిష్ఠిత, సకల తత్త్వ ప్రతిష్ఠిత।**
**వివిధ సంకల్ప కల్పక, విబుధ సంకల్ప కల్పక**
**జయ జయ శ్రీ సుదర్శన, జయ జయ శ్రీ సుదర్శన ॥**

**అర్థం :-** మహితసంపత్ సదక్షర ! మహిత=గొప్ప; సంపత్=జ్ఞానమనే ఐశ్వర్యంచేత; సత్=సత్పురుషులకు; అక్షర=మోక్షరూపమైన వాడా! విహిత సంపత్ షడక్షర! విహిత=అనుగ్రహింపబడిన; సంపత్=సంపత్తుగల; షట్+అక్షర=ఆఱు అక్షరాలు గల మంత్రం కలవాడా! షడరచక్ర ప్రతిష్ఠిత। షట్+అర=ఆఱు కోణాలను కల్గిన; చక్ర చక్రమందు; ప్రతిష్ఠిత= అధిష్ఠించియున్న వాడా! సకల తత్త్వ ప్రతిష్ఠిత! సకల=సమస్త; తత్త్వ=భావాలయందు, ప్రతిష్ఠిత=ఉన్నవాడా! వివిధ సంకల్పకల్పక! వివిధ=రకరకాలైన; సంకల్ప=కోరికలకు; కల్పక=కల్ప తరువులాంటి వాడా! విబుధ సంకల్ప కల్పక! విబుధ=దేవతల యొక్క; సంకల్ప=కోరికలను; కల్పక=తీర్చువాడా! శ్రీ సుదర్శన! జయ, జయ! శ్రీ సుదర్శన! జయ, జయ॥

**తా ॥** గొప్ప జ్ఞాన ధనంగల బ్రహ్మవేత్తలకు మోక్షరూపమైనవాడా। సంపత్తుననుగ్రహించే ఆఱు అక్షరాల మంత్రంచేత ఉపాసింపబడే వాడా! షట్కోణాలుగల చక్రమందు ఉన్నవాడా! సకల తత్త్వాల యందు వ్యాపించచి

యున్నవాడా! కోరికలన్నీ తీర్చువాడా! దేవతలకు అభీష్టప్రదుడా! ఓ శ్రీ సుదర్శన! జయ, జయ! హే శ్రీ సుదర్శన! జయ, జయ!!

**వ్యాఖ్య :–** సకల ఫలదాతయని వర్ణితం.

**1. మహిత సంపత్ సదక్షరుడు :–** గొప్ప సంపత్తు అంటే బ్రహ్మజ్ఞానమన్న మాట. "సన్తమేనంతతో విదుః" బ్రహ్మవేత్తకే 'సత్' శబ్దం వర్తిస్తుంది. "అక్షరంతు మోక్షే ఽపి" (అమరం) అట్టి సచ్ఛబ్దవాచ్యులకే మోక్షమిచ్చువాడా! అని అర్థం.

**2. విహిత సంపత్ షడక్షరుడు :–** సుదర్శన మంత్రం ఆఱు అక్షరాలుకలది. "ఓమ్ నమశ్చక్రాయ" అనే ఈ మంత్రంలోని ఒక్కొక్క అక్షరం ఐశ్వర్యాన్ని సంపాదించి పెడుతుందని అర్థం.

**3. షడర చక్ర ప్రతిష్ఠితుడు :–** అరలు అంటే కోణాలు. ఆఱు కోణాలు చక్ర మందు ఉంటాయి. కాబట్టి షడరచక్రమందు సుదర్శనుడు ఉంటాడు.

**4. సకల తత్త్వ ప్రతిష్ఠితుడు :–** సమస్త వస్తువులందు అంతర్యామి రూపంలో శోభిస్తుంటాడు. మనస్సు చక్రమే కదా! అచట తద్ధర్మంగా భాసించి యుంటాడు. "యః పృథివ్యాంతిష్ఠన్"–"య ఆత్మని తిష్ఠన్"– ఇత్యాది బృహదారణ్య కోపనిషత్ సూక్తులు 'భగవానుడు సర్వాంతర్యామి' అని ప్రతిపాదిస్తున్నాయి కదా! "ఎప్పోదుమ్ కైకషలానేమియాన్"–ఎప్పుడూ అంటే పంచావతారాల్లోనూ భగవానుడు సుదర్శనుణ్ని తన చేతియందు విడువకుండా ధరించి యుంటాడు, అని ఆళ్వార్ల శ్రీ సూక్తి వల్ల, భగవద్ధర్మం సుదర్శనునికి కూడా సాధర్మ్య మవుతుంది కదా!

షడర చక్రప్రతిష్ఠితుడు–సకల తత్త్వ ప్రతిష్ఠితుడు, ఎలా అవుతాడనే విరోధాభాసం ధ్వనిస్తుంది. కాబట్టి దీనికి,–భగవానునికి ప్రతి రూపంగా భాసించే సుదర్శనుడు, సకల తత్త్వాలయందు అంతర్యామిగా ఉండేవాడనండం

వల్ల, ఆవిరోధం పరిహారమవుతుంది. **"కోణేక్వా ఽపిస్థితో ఽసిత్రిభువనవిత తః"**- ఎక్కడనో షట్కోణ చక్రమందు ఉండే వాడయినా, మూడు లోకాలలలోనూ విస్తరించి యుండేవాడు-అని సుదర్శన శతకసూక్తి. "వితతం పురాణం" అనే శ్రుతి కూడా పల్కుతుంది.

**5. వివిధ సంకల్ప కల్పకుడు :-** అనేక కోరికలకు కల్పతరువులాంటి వాడు.

**6. విబుధ సంకల్ప కల్పకుడు :-** అమరులకు-బాగా తెలిసి ఉపాసించే వారికి, కలిగే కోరికలనీడేర్చేవాడు. "ఎనక్కే తన్నై తన్ద కఱ్పగమ్" నాకు తననే ఇచ్చుకొన్న కల్ప వృక్షం, భగవానుడు' అని ఆళ్వార్లన్నారు. కల్పవృక్షం మనం కోరిన వస్తువునే ఇస్తుంది. తానే తనను ఇచ్చుకోదు. కల్పవృక్షం కన్న కమలాక్షుడు మిన్న అన్న విషయం ప్రస్ఫుటం కదా!

శ్రీ యామునా చార్యుల స్తోత్ర రత్నంలోని 'అర్థ కల్పక' మనే విశేషణాన్ని శ్రీ వేదాన్త దేశికులు వ్యాఖ్యానిస్తూ, మూడు వ్యుత్పత్తులను చూపినారు. 1. "అర్థినాం కల్పద్రుమవత్ సర్వాపేక్షిత ప్రదమ్"- అడిగిన వారికి కల్పవృక్షం లాగా కోరినవన్నీ ఇచ్చేవాడు.

2. అర్థినః కల్పద్రుమభూతాః యస్యసః అర్థికల్పకః" ఎవనికి యాచకులు కల్పతరువులాంటి వారో అతడు అర్థికల్పకం. అంటే, అనేక విధాలైన వరాలను జనుల కివ్వాలి అనే భగవానుని ఆశను, అర్థిజనం తమ తమ వరాలను కోరడం ద్వారా, సఫలంచేస్తుంది. కాబట్టి, భగవానుని దృష్టిలో యాచకులే ఉదారులు. "ఉదారాః సర్వఏవైతే" (భగవద్గీత) ఇచ్చేవాడు ఉదారుడుకాదు. అవాప్త సమస్త కాముడైన భగవానుని వల్ల ఏదైనా పొందగోరే వాడు కల్పవృక్షం. అతడే కామధేనువని అర్థం.

3. స్వయ మర్థినః కల్పయ తీత్యర్థః క్షేత్రజ్ఞానాంతత్తత్ పురుషార్థాధికార దశా ఽపి హి పరమపురుష కల్పితా". తానే యాచకులను కల్పించే వాడు, జీవులు ఆయా పురుషార్థాలను అనుభవించే దశనూ కల్పించే వాడు, కాబట్టి భగవానుడు 'అర్థికల్పకం' (ఈ విషయాన్ని శ్రీరంగరాజస్తవం'- పూర్వ శతకానికి, మహావ్యాఖ్యాత డా॥ ఈ.ఏ.శింగరాచార్యస్వామి వారు తాము రచించిన 'వరివస్యా' వ్యాఖ్యానంలో వివరించారు)

శ్రీ వేదాన్త దేశికులు భగవానునికి వర్తించే 'సంకల్ప కల్పక, అనే శబ్దార్థాన్ని ఇక్కడ శ్రీ సుదర్శన చక్ర విషయానికి అనుసంధించారు.

7. ఇలాంటి శ్రీ సుదర్శన భగవానుడా। జయ, జయ!!

8. ఓ సుదర్శన చక్రమా! జయ, జయ!!

VIII. **భువన నేత్రత్రయీ మయ, సవనతేజస్త్రయీమయ**
**నిరవధి స్వాదు చిన్మయ, నిఖిలశక్తే, జగన్మయ।**
**అమిత విశ్వక్రియామయ, శమిత విష్వగ్భయామయ**
**జయ జయ శ్రీ సుదర్శన, జయ జయ శ్రీ సుదర్శన ॥**

**అర్థం :-** భువన నేత్ర=మూడులోకాలకు కన్నులాంటి వాడా! త్రయీమయ= వేద స్వరూపుడా! సవన తేజః+త్రయీ మయ=యాగంలోని మూడు విధాలైన అగ్నుల రూపమైనవాడా! నిరవధి స్వాదు చిన్మయ! నిరవధి=అవధిలేని; స్వాదు=భోగ్యమైన; చిత్+మయ=జ్ఞానమయ స్వరూపం కలవాడా! నిఖిల శక్తే=సర్వ విధమైన శక్తిని కలవాడా! జగత్+మయ=జగత్తు ఆకారంగా కలవాడా! అమిత విశ్వక్రియామయ! అమిత=అంతులేని; విశ్వ=లోకాల యొక్క; క్రియామయ=క్రియల రూపమైనవాడా! శమిత విష్వక్ భయామయ! శమిత=శమింపజేయబడిన; విష్వక్=సమస్తమైన; భయ=సంసారభీతి అనే;

అమయ=వ్యాధిని కలవాడా! శ్రీ సుదర్శన! జయ, జయ!!

**తా॥** భువనత్రయానికి నేత్రమైన వాడా! వేదస్వరూపుడా! యాగాలలో మూడు విధాలైన అగ్నుల రూపమైనవాడా! అవధిలేని భోగ్యమైన జ్ఞానాత్మక స్వరూపం కలవాడా! సర్వ శక్తిమంతుడా! జగద్రూపుడా! సర్వకర్మ సమారాధ్యుడా! సమస్తమైన సాంసారిక భయమనే రోగాన్ని పోగొట్టేవాడా! శ్రీ సుదర్శన! జయ, జయ! శ్రీ సుదర్శనుడా! జయము, జయము!!

**వాఖ్య :-** సర్వాత్మకత్వం వర్ణితం.

**1. భువన నేత్రుడు :-** భగవంతుణ్ని వేదం నేత్రరూపునిగా కీర్తించింది.

**"చక్షుర్దేవానాముత మర్త్యానామ్" (శ్రుతి).**

**"కణ్ణావానెన్టుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు" (తి.వా.మొ).**

దేవతలకూ, మర్త్యులకూ కన్నులయి ఉన్నాడు.

" ఏకం లోకస్యచక్షుః" (సుదర్శన శతకం-10) శ్రీ కూరనారాయణులు కూడా సుదర్శన భగవానుణ్ని లోకానికి చక్షువుగా వర్ణించారు.

**2. త్రయీమయుడు :-** ఋగ్యజుస్సామ వేద సముదాయానికి 'త్రయీ' అని పేరు. కాబట్టి వేద స్వరూపుడు. వేద ప్రతిపాద్యుడు.

ఈ రెండు పదాలను కలిపి ఒకే పదంగా "భువన నేత్రత్రయీమయుడు" అని చెప్పవచ్చును. భువననేత్ర పదం త్రయీ పదానికి విశేషణం. లోకాలకు కన్నులాంటిదైన వేదం స్వరూపంగా కలవాడని అర్థం. **"వేదామే పరమం చక్షుః" "సర్వస్యలోచనం శాస్త్రం"** అనే సూక్తులున్నాయి కదా!

"వస్త్రే మధిగుణే నాద్యాం నేత్రం నేతరితుత్రిషు"- (నిఘంటువు) 'మధిగుణః'=మంధానస్య ఆకర్షణ రజ్జుః. "కవ్వపు త్రా"డని నేత్ర శబ్దానికి అర్థం ఉంది. "మంధానం మందరం కృత్వా నేత్రం కృత్వాచ వాసుకిమ్"

అనేది పురాణ వాక్యం. దీన్ని బట్టి నేత్ర శబ్దానికి పాశం అనే అర్థం ఏర్పడుతుంది. కాబట్టి ఈ శ్లోకంలో 'భువననేత్ర' శబ్దానికి లోకాత్మకమైన పాశరూపుడనే అర్థం వల్ల, పాశమనే ఆయుధ కార్యం సూచింపబడిందని ఒక వ్యాఖ్యాత తెల్పడం విశేషం.

**3. సవన తేజస్త్రయీమయుడు :-** 'తేజః+త్రితయం' అంటే గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని, దక్షిణాగ్ని అనే మూడు అగ్నులు సవనాలలో విధిగా వ్యవహరింపబడుతాయి. అట్టి మూడగ్నుల రూపమైనవాడు సుదర్శనుడు.

**4. నిరవధి స్వాదు చిన్మయుడు :-** చిత్ శబ్దానికి 'చిత్తు' స్వయం ప్రకాశాత్మకమవడం వల్ల తేజస్సు, జ్ఞానం అనే అర్థాలూ చెబుతారు. నిరవధికమైనది కాబట్టి నత్యమని అర్థం. 'స్వాదు' అంటే పరమభోగ్యమైనందువల్ల ఆనందమని అర్థం. 'చిత్' శబ్దం జ్ఞానార్థకం. సత్యమైన, ఆనందమయమైన, జ్ఞానమయమైన రూపం కలవాడు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనే శ్రుత్యర్థం చేత దేశికులు సుదర్శన భగవానుని స్తుతించారు. "మషుజ్ఞాదజ్ఞానమే పడైయాక" - అంటూ, అళ్వార్లు సుదర్శనుడు శుద్ధజ్ఞాన స్వరూపుడని తెలిపారు. మరొక ప్రామాణిక వాక్యం

"జ్ఞానమేవ పరం రూపం బ్రహ్మణః పరమాత్మనః।
తదాతుచక్రమిత్యాహుః, బ్రహ్మ యాథాత్మ్య వేదినః" ॥

(అహిర్బుధ్న్య సంహిత)

**5. నిఖిలశక్తే :-** సర్వశక్తిమంతుడా! అని సంబుద్ధి. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధాత్మక వ్యూహ భూతుడైన సుదర్శనుని యొక్క రూపాలే శ్రీ వాఙ్మృడానీ రూపాలు కల్గిన శక్తులు, కాబట్టి సకల వ్యాపారాలయందు సామర్థ్యంకలవాడు సుదర్శనుడు. "పరా ౽స్య శక్తిర్వివిధైవ శ్రూయతే" అనే శ్రుత్యర్థం సుదర్శన విషయంలో సమన్వయించడం కమనీయమే.

**6. జగన్మయుడు :-** విశ్వం ఆకారంగా కలవాడు. ఆళ్వార్లు "పుకష్నల్లొరువనెన్గో" (తిరువాయ్‌మొషి) దశకంలో శ్రియః పతి యొక్క జగద్రూపాన్ని అద్భుతంగా స్తుతించారు. అది ఇక్కడ అనుసంధేయం.

**7. అమిత విశ్వక్రియా మయుడు :- "తిరోభావసృజం చైవ స్థితి సంసృత్యనుగ్రహాత్"** అనే పంచకృత్యాలు అమితమైన విశ్వం యొక్క క్రియలు. కాల, పురుష, ప్రకృతి, మహత్, అహంకార, జగత్ అనే ఆఱు షట్ చక్రాలు. ఈ షట్‌చక్ర మధ్యవర్తియైన సుదర్శనుడు ఆపంచ కృత్యాలను నిర్వహిస్తాడు. అని అర్థం "కాలాద్యే చక్రషట్కే ప్రకటిత విభవః పంచకృత్యాను రూపమ్" (సు.శతకం)

**8. శమిత విష్వక్ భయా మయుడు :-** సకల ఆధివ్యాధులను పోగొట్టేవాడు. భయాన్నీ, ఆమయాన్నీ పోగొట్టేవాడు. భయం వల్ల కలిగే రోగాన్నీ పొగొట్టేవాడనీ అర్థం. "హరతా దస్త్రరాజో రుజంవః" (సు.శ).

పాపకర్మల వల్ల ఆధివ్యాధులుకలుగుతాయని శాస్త్రం చెబుతుంది. అట్టివ్యాధులు అనుభవిస్తే గాని నశింపవు. కాబట్టి, శ్రీ సుదర్శన మంత్రపూతమైన జలాన్ని (తీర్థాన్ని) ఏడు దినాలు క్రమంగా పానంచేస్తే కుష్ఠు, గుల్మాపస్మారాది వ్యాధులు కూడా నశిస్తాయని అనుభవజ్ఞులు చెబుతారు. భృగు సంహితలోని 'సుదర్శన కవచ మందలి ఫలశ్రుతిలో ఈ విషయం ఉంది.

**"కుష్ఠా పస్మారగుల్మాద్యా వ్యాధయః కర్మహేతుకాః।**
**నశ్యంతేతన్మం త్రితాంబు పానాత్ సప్తదినావధి॥"**

9. శ్రీ సుదర్శన! జయ, జయ! 10. శ్రీ సుదర్శన! జయ, జయ!

శ్రీ మద్వేదాన్తదేశికులు అష్టశ్లోకాలతో సుదర్శన భగవానుణ్ని స్తుతించడం అష్టవాక్ పుష్పాలతో ఆరాధించడమే, అవుతుందని పండితప్రకాండులన్నారు.

అష్టపుష్పాలు ఇలా ఉన్నాయి. "అహింసా ప్రథమం పుష్పం, పుష్పమింద్రియనిగ్రహః! సర్వభూతదయా పుష్పం క్షమాపుష్పం, విశేషతః। జ్ఞానం పుష్పం తపః పుష్పం ధ్యానం పుష్పంతథైవచ। సత్యమష్టవిధం పుష్పం" అహింస, ఇంద్రియనిగ్రహం, భూత దయ, క్షమ, జ్ఞానం, తపస్సు, ధ్యానం, సత్యం – అనేవి ఎనిమిది పువ్వులు.

ఈ శ్లోకాలలో పునరుక్తిగా కనబడే పదాలున్నాయి. ఆదరాతిశయం చేత ప్రయుక్తమైన ఆపదాలలో అర్థభేదం ఉండడం వల్ల ఛేకానుప్రాసాలంకారం ఉంది. అభిలషించిన అర్థాశంసనమూ ఉండడం చేత 'ఆశీస్సు' అనే అర్థాలంకారం. "ఆశీర్నామాభిలషితే వస్తున్యాశంసనమ్" అని దీని లక్షణమ్.

ఈ స్తోత్రం 'భోగావళీ' అనే చిత్రకావ్య ప్రబంధవిశేషమని కొందఱు, భోగావళీ కావ్య లక్షణాలు సమగ్రంగా లేనందువల్ల ముక్తక శ్లోకాలతో కూడిన ఖండకావ్యమన్నారు. మరికొందఱు "ధృతి" అనే ఛందస్సులోని సప్తదశ సహస్రాధిక ద్విలక్షతమమైన (2,17,000) వృత్తమని శ్రీమాన్ భారద్వాజ శ్రీ రాజగోపాలాచార్య విరచితమైన సంస్కృత వ్యాఖ్యానంలో ఉంది. సంస్కృత వ్యాఖ్యాన సహితమైన శ్రీ సుదర్శనాష్టకస్తోత్రానికి విఖ్యాత వ్యాఖ్యాతలైన శ్రీమాన్ ఐ.భాష్యకారాచార్య స్వామి వారు రచించిన ఆంధ్రవ్యాఖ్యానమందు ఆపూర్వమగు ఈ వృత్తం 'పథ్యా' అను 18వ ఛందస్సునకు చెందినది' అని వివరింపబడింది.

ప్రతిపాదమందు న,త,భ,గణాలు రెండుసార్లు ఆవృత్తమవుతాయి. 'వృత్తరత్నాకర' గ్రంథంలో (పేజి.31) "త్రిషుగణేషు పాదః పథ్యాద్యేచ" (పి.సూ.4–22) అని పింగళ సూత్రం మాత్రముంది.

IX. ద్విచతుష్కమిదం ప్రభూతసారం
పఠతాం వేంకటనాయకప్రణీతమ్।

**విషయే ఽపి మనోరథః ప్రధావన్**
**నవిహన్యేత రథాంగ ధుర్యగుప్తః ॥**

**అర్థం :-** వేంకటనాయక ప్రణీతం= వేంకటనాయకులనే వేదాంతదేశికులచే అనుగ్రహింపబడిన; ప్రభూత సారం=గొప్పశక్తిని కలిగిన; ఇదం=ఈ; ద్వి, చతుష్కం=రెండేసి పదాలతో నాల్గుపాదాలు కలిగియున్న సుదర్శనాష్టక స్తోత్రాన్ని; పఠతాం=పఠించు వ్యక్తుల యొక్క; మనోరథః=మనస్సు అనే రథం; విషమే=సమంగా లేని దారి అనే కోరిక (ల) యందు; ప్రధావన్, అపి=పరుగిడిననూ-ఆసక్తమైనదైననూ; రథాంగ ధుర్య, గుప్తః=చక్ర (భారవహమైన) సామర్థ్యంచేత రక్షింపబడినదై; న, విహన్యేత= కొట్టుబడదు-భంగం పొందదు.

**తా॥** శ్రీ వేంకటనాథార్యులచే రచింపబడిన, గొప్పశబ్ద శక్తి కలిగిన ఈ సుదర్శనాష్టకస్తోత్రాన్ని పఠించే ప్రపన్నుల మనస్సు, పొందరాని విషయా (ప్రదేశా)ల యందు సంచరిస్తున్ననూ, శ్రీ సుదర్శనుని (భారం వహించే శ్రీ రంగనాథుని) చే రక్షింపబడుతూ ఉజ్జీవిస్తుందేకాని నశింపదు.

**వ్యాఖ్య :-** స్తోత్రపఠనం వలనిఫలాన్ని వినిపించే శ్లోకమిది.

కర్మజ్ఞాన భక్త్యాదులే సాధనాలని తలచి, చంచలమనస్సుచే వాటినాచరించడానికి కష్టపడడం కంటే, స్తోత్రానుసంధానం చేయడం సులభ పద్ధతి. పూర్వాచార్యులు తాము స్తుతించి, భగవానుని అనుగ్రహాన్ని పొందిన తర్వాత, తమవలె ఇతరులు కూడా ఉజ్జీవించవలెననీ అవ్యాజ కృపతో అనుగ్రహించినదే ఈ స్తోత్ర పద్ధతి. భగవంతుని కృపను సులభంగా పొందదగిన శక్తిగల శబ్దాలను ప్రయోగించి, ఆచరించి, అనుభవించి, మనకందించిన శ్రేయస్కాములు ఆచార్యులు.

**"అంతే ఽనుష్టుభ మార్యాం వా కవికృత్యాఖ్యయాన్వితామ్।**

**కుర్యాత్ చాటు ప్రబంధానా మేష సాధారణోవిధః॥**
"అని లక్షణాన్ని చెప్పినారు లాక్షణికులు.

కవి, తాను రచించిన కావ్యం చివర తనపేరు, కావ్యం పేరు కలిగియుండే శ్లోకాన్ని రచించి, తత్కావ్య పఠనం వలన కలిగే ఫలాన్ని కూడా తెలియజేయడం సాధారణమైన విధి.

'సాధారణ విధి' అంటే ఖ్యాతిలాభాల కోసం చేయడం పరిపాటి అనే అర్థం కలదే కాదు. లోకులు స్తోత్రాన్ని శుచిర్భూతులై ఆచార్యోపదిష్టులై అనుసంధించునట్లూ, లోకనాథుడు అనుసంధాన పరులను అనుగ్రహించు నట్లూ, చేయదగిన ఆదర్శ పద్ధతి. (ఆదర్శం అంటే అద్దం కదా!) జీవునికీ, దేవునికీ ఇది సమాన ధర్మమే, అని అర్థం.

మనస్సు రథం లాంటిది. ప్రకృతి విషమమైనది. (సమాన స్థితిలో ఉంటే ప్రళయ మవుతుంది) ఎత్తు పల్లాలు గల మార్గంలో నడిచినా, దృఢమైన చక్రాలున్న రథం ఒడుదొడుకులతో భంగపడక గమ్యం చేరుతుంది.

శ్రీ దేశికులు రచించి అనుగ్రహించిన శ్రీ సుదర్శనాష్టక స్తోత్రాన్ని పఠించిన భక్తుల మనోరథం, ప్రమాద వశాన పొందరాని విషయా (స్థలా) ల యందు పరిభ్రమించినప్పటికీ, శ్రీ సుదర్శనుని చేతనూ, తద్ధారవహుడైన శ్రీ రంగనాథుని చేతనూ రక్షితమై ఉజ్జీవిస్తుంది. ఏ విధంగానూ నశించదని అర్థం. 'రథాంగ ధుర్యుడు' అంటే చక్రమనే భారాన్ని మోసే సమర్థుడు, సుదర్శనుడని అర్థం. చక్రాన్ని ధరించే శ్రీ నాథుడనీ అర్థం. శబ్దశక్తి అట్టిది. శ్రియః పతిత్వం లాగా, చక్రధారిత్వమూ సర్వేశ్వరత్వ సూచకం. "**యస్మిన్ విన్యస్యభారం విజయిని జగతాం జంగమస్థావరాణామ్**" – సుదర్శన శతకసూక్తి 'జగన్నిర్వాహమనే కార్యం శ్రీ సుదర్శనాధీన, మని (రథాంగం ధుర్యమని) తెల్పుతున్నది. సర్వాభీష్టప్రదమైనది శ్రీ సుదర్శనాష్టకం.

ఈ చివరి శ్లోకం, వసన్తమాలికా వృత్తం.

**"విషమే ససజాగురూ, సమేచేత్ సభరాయశ్చ వసంతమాలికాస్యాత్"** అని వసంతమాలికా వృత్త లక్షణం.

ఇది శ్రీమాలోల నృసింహస్వామి కటాక్షపాత్ర, హరితసగోత్ర, శ్రీమాన్ కారంచేటి తిరుమల మనోహరా చార్య ప్రథమ పుత్ర, వేంకటరాఘవాచార్య విరచిత, ఆంధ్రటీకాతాత్పర్య, జ్వాలావ్యాఖ్యా సమేత, శ్రీమద్వేదాన్త దేశికాను గృహీత శ్రీ సుదర్శనాష్టకమ్

**కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే ।**
**శ్రీమతే వేంకటేశాయ వేదాన్త గురవే నమః ।1!!।**



# శ్రీమాలోల గ్రంథమాల, హైదరాబాద్

## లభించు ఇతర గ్రంథములు

| | |
|---|---|
| 1. కామాసికాష్టకం - శ్రీమద్వేదాంత దేశిక ప్రణీతము. | |
| తెలుగు వ్యాఖ్యా సహితము | 5-00 |
| 2. గరుడ దండకము - శ్రీమద్వేదాంత దేశిక ప్రణీతము. | |
| తెలుగు వ్యాఖ్యా సహితము | 10-00 |
| 3. అహోబల నారసింహుడు | 25-00 |
| 4. Life & Works of Sri Nigamantha Maha Desika | 25-00 |
| 5. దివ్య ప్రబంధత్రయి | 30-00 |
| 6. రహస్యార్థ రామాయణము | 30-00 |
| 7. ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళి | 50-00 |
| 8. శ్రీ సన్నిధి నిత్యానుష్టాన క్రమం | |
| (ద్రవిడ మరియు సంస్కృత మూలం) | 150-00 |
| 9. పాదుకా సహస్రమ్ - శ్రీమద్వేదాంత దేశిక ప్రణీత ఆంధ్ర | |
| టీకాతాత్పర్య వ్యాఖ్యా సహితము ( 1నుండి 5 సంపుటములు) | 350-00 |

గమనిక : పై పుస్తకములు పోస్టు ద్వారా పంపినచో తపాలా ఖర్చులు అధనముగా చెల్లించవలెను.